# నవభారతము

## ఆది, సభా పర్వములు





రచయిత

కన్నెకంటి వీరభద్రాచార్యులు
(పల్నాటి సోదరకవులు)

# తొలిపలుకు

నవభారత మనుపేర భారతజాతీయోద్యమచరిత్ర పద్యకావ్య ముగ రచింప సంకల్పించి యిప్పటి కాఱు సంవత్సరములైనది. మహాత్ముని నాయకత్వమున భారత నాయకులు, ప్రజలు సాగించిన శాంతి సమరము జయప్రదముగ నెరవేరుటయు మనము దాస్యవిముక్తుల మగుటయు ఖండ ఖండాంతరవాసు లెఱిఁగిన విషయమే. దానిని వేఱుగఁ జెప్ప నవసరము లేదు. ఇం దాది సభా పర్వములు మాత్రమే కలవు. భరత పరిపాలనముచే భారతదేశమను పేరు వచ్చుటాది కథ పొందుపరుపఁ బడినది. నాఁటినుండి జరిగిన సాంఘిక, సాయుధ విప్లవములు భారత చక్రవర్తుల చరిత్రలు సూక్ష్మములుగ నాదిపర్వమున గలవు. ప్రథమ భారత మహాసభ జరుగుటకు హేతువు మొదలు సభ జరిగిన వరకు సభాపర్వమునఁ గనుపించును. రాబోవు పర్వములలో నరువది సంవత్సరముల వివిధ స్వాతంత్ర్యోద్యమముల వృత్తాంతములు తెలియును. కావ్యము పూర్తియగువరకు ముందంజ వేసి నన్ను నా కుటుంబమును నాదరించిన శ్రీ నాళం మట్టపల్లిగుప్త గారికిని శ్రీ పెరుమాళ్ళ శేషయ్యగుప్త గారికిని, శ్రీ యేచూరి వేంకటగురువులుగుప్త గారికిని కృతజ్ఞుఁడను. రచనా కాలమందు దమ యమూల్యాభిప్రాయముల నిచ్చి తోడ్పడిన శ్రీ శ్రీ తత్త్వానందస్వాములవారికిని, జాతీయకవి శ్రీ జాస్తి వేంకటనరసయ్యగారికిని, శ్రీ యేకా ఆంజనేయులు పంతులుగారికిని శ్రీ తుమ్మల రామకోటయ్యచౌదరి (నర్సారావుపేట) గారికిని హృదయపూర్వకాభివందనములు. ప్రథమసంపుట ముద్రణమునకు సాయమొనర్చిన మహాశయులకు నా మన్ననలు. నా కవితాభ్యుదయమునకు మూలకందమయిన అభినవతిక్కన శ్రీ తుమ్మల సీతారామమూర్తికవి గారికిని, కావ్యముద్రణమునకు సదా ప్రోత్సహించిన మా అనసూయాది సోదరీమణులకును, కృతాంజలులు. కవితా, కథా సందర్భములలోఁ గల పొరపాటులఁ దెలిపినచోఁ బునర్ముద్రణమున సవరించుకొందునని మనవి చేయుచు నీ ప్రథమ సంపుటమును పాఠక లోకమున కందించుచున్నాను.

— రచయిత

# కావ్యోద్ధారకులు

(గుంటూరుజిల్లా పల్నాడుతాలూకా రెంటచింతల వాస్తవ్యులు)

శ్రీ నాళం కోటిలింగము కుమారుడు మట్టపల్లిగుప్తగారు

శ్రీ పెరుమాళ్ళ వెంకయ్య కుమారుడు శేషయ్యగుప్తగారు

శ్రీ యేచూరి హనుమంతయ్యగారి రామయ్య కుమారుడు వేంకటగురువులుగుప్తగారు

# గ్రంథ ముద్రణకు సహాయపడిన దాతలు

(గుంటూరుజిల్లా పల్నాడుతాలూకా కొర్జంపాటి వాస్తవ్యులు)

శ్రీ తంగెడ నరసింహారావు కుమారుడు మల్లికార్జునరావుగారు
శ్రీ బాదం బాలిరెడ్డి కుమారుడు చిన్నారెడ్డిగారు
శ్రీ కంకర పెదనర్సిరెడ్డి కుమారుడు గోపిరెడ్డిగారు
శ్రీ బాదం బక్కారెడ్డి కుమారుడు బాలిరెడ్డిగారు
శ్రీ బాదం వేంకటరెడ్డి కుమారుడు బక్కారెడ్డిగారు
శ్రీ కంకర చిననర్సిరెడ్డి కుమారుడు హనిమిరెడ్డిగారు
శ్రీ కంకర చిననర్సిరెడ్డి కుమారుడు మాలకొండారెడ్డిగారు
శ్రీ కంకర నరిసిరెడ్డి కుమారుడు పెదస్వామిరెడ్డిగారు
శ్రీ కంకర పెదవేంకటస్వామి కుమారుడు చినస్వామిరెడ్డిగారు
శ్రీ కోట చినచెన్నారెడ్డి కుమారుడు కోటిరెడ్డిగారు
శ్రీ కంకర చినవెంకటస్వామి కుమారుడు పిచ్చిరెడ్డిగారు
శ్రీ కామిరెడ్డి హనిమిరెడ్డి కుమారుడు వేంకటరెడ్డిగారు
శ్రీ మారం పేరిరెడ్డి కుమారుడు హనిమిరెడ్డిగారు
శ్రీ రొక్షం సుబ్బారెడ్డి కుమారుడు రామలింగారెడ్డిగారు
శ్రీ రొక్షం సుబ్బారెడ్డి కుమారుడు వీరలింగారెడ్డిగారు
శ్రీ బాశం లచ్చారెడ్డి కుమారుడు నాగిరెడ్డిగారు
శ్రీ మేడగం నాగిరెడ్డి కుమారుడు సిద్దారెడ్డిగారు
శ్రీ మేడగం నాగిరెడ్డి కుమారుడు రామిరెడ్డిగారు
శ్రీ దారం నాగిరెడ్డి కుమారుడు వేంకటసుబ్బారెడ్డిగారు
శ్రీ బాశం రామిరెడ్డి కుమారుడు కోటిరెడ్డిగారు
శ్రీ బాదం చిన్నారెడ్డి కుమారుడు చినబాలిరెడ్డిగారు
శ్రీ ఇడంగంటి లింగారెడ్డి కుమారుడు గాలిరెడ్డిగారు
శ్రీ బోనముక్కల నాగిరెడ్డి కుమారుడు కృష్ణారెడ్డిగారు
శ్రీ బోకిరెడ్డి వేంకటరెడ్డి కుమారుడు గోపిరెడ్డిగారు
శ్రీ శీలం బక్కారెడ్డి ద॥ కుమారుడు వేంకటరెడ్డిగారు
శ్రీ భోగిరెడ్డి వెంకటస్వామి కుమారుడు రామకోటిరెడ్డిగారు

# కృతజ్ఞత

ఉ. ఆయుధముల్ ధరింపక మహాత్ముని యానతిమీరఁబోక జా
తీయపథంబు బాయక సుధీమణులై జయరాశిఁగొన్న మా
నాయకులున్ ప్రజల్ ఘనులనంగఁ దదుద్యమవృత్తమున్ జిర
స్థాయిగనిల్పఁ గావ్యమునఁ జాటదలంచితి సంగ్రహమ్ముగన్.

ఉ. ఏ నిరుపేదనోటలు గ్రహించి కడుంగడుజాలి నన్ను నా
హ్వానమొనర్చి కావ్యము సమాప్తముఁజెందినదాక నెంతయోఁ
బూనిక నా కుటుంబమును బోషణచేసిన యుప్పూరయ్యలన్
జ్ఞానధనాఢ్యులన్ మరువఁజాలను నిక్కము జీవితాంతమున్.

ఉ. కమ్మనిసంపదల్ విరియఁగాసినవెన్నెల లట్లు సర్వసౌ
ఖ్యమ్ములఁ గూర్చుచుండఁ దన గర్భమునందెడలేని మైత్రితో
ముమ్మతముల్ వెలుంగ నవమోహనరూప కళావికాసమున్
జిమ్మెడి రెంటచింతల వసించెద ! రా సుమతుల్ సుధీహితుల్.

ఉ. వారల నాళ మన్వయుఁడు వైశ్యకులాభరణుండు ధర్మమున్
గోరెడి కోటిలింగమునకున్ సతి వేంకటరామమాంబకున్
గూరిమిఁ బుత్రుఁడై విబుధకోటిమెలంగెడి మట్టపల్లి న
న్నారసి పల్కెనిట్టుల మహాదర పూర్వకభాషణంబులన్.

ఉ. ఓ కవిచంద్ర ! భారత మహోద్యమ భవ్యచరిత్ర మంతయున్
జేకొని పద్యకావ్యము రచింపఁ దలంచితివంచు వింటి సు
శ్లోకముగూర్చ నీకృతి త్రిశుద్ధిగ మేమిడనెంచు సాయమున్
గైకొనుమయ్య! పూర్తియగు కాలముదాక నటంచుఁ బల్కుచున్.

ఉ. మానధనుండు వేంకయకు మానవతీమణియై మెలంగు ల
క్ష్మీనరసమ్మ కాత్మజుఁడు (శ్రీ) పెరుమాళ్ళకులోద్భవుండు మే
ధానిధి శేషయాభిదుఁ డుదారచరిత్రుఁడు మిత్రుఁడౌట నా
హ్వానముఁజేసి యవ్విషయమంత నెఱుంగఁగఁజేయ నాతఁడున్.

ఉ. గౌరవమున్ గడించి బుధకాండమునన్ విహరించుచున్న యే
చూరికులావతంసుని యశోధని రామయగుప్తకున్ జయా
కార సుసాధ్వియైన కనకమ్మకుఁ బ్రేమసుతుండు నాఁ గళా
సారముఁ గన్నధీమణిని శాంతుని వేంకటగుర్వుఁ బిల్వఁగన్.

వ. పిమ్మట నయ్యూరువుర నవలోకించి జాతీయవాదియుఁ బూర్వ ము
రధికారదౌర్జన్యంబుల నెదుర్కొని పలునాఁట కాంగ్రెసోద్యమముల
సాగించిన యువనాయకుండగు పెరుమాళ్ళ శాయన్న సహా
చరుండును దేశీయవస్త్రవ్యాప్తి నొనరించి గాంధీమహాత్ముని
శిష్యుఁడనిపేరంది సత్యాగ్రహములఁబాల్గొని కారాగారశిక్షల
ననుభవించి తుదివిజయంబుసాధించి దేశమాతృత్రాణముఁ దీర్చికొన్న
మట్టపల్లిగుప్త.

చ. మన కవి చేయుచున్నకృతి మంచిది యీ నవభారతంబునం
గనవడు భారతోద్యమ వికాసచరిత్రము కాని పేదయై
మనఁగడ సల్పుచుండెడిసుమీ తగుసాయముఁ గూర్చుచున్న నా
పని నెరవేరు మువ్వురముఁ బంచికొనందగు నట్టిభారమున్.

చ. అనవిని యిర్వురున్ ముదమునంది మహాశయ నీమహాంట కా
దనఁగలమా! యటంచు దరహాసములూరవచించి యెంతయో
గనికర మొప్ప సాయపడగల్గిరి కావ్యము పూర్తియయ్యె న
య్యనుపమ శేముషీధనుల కర్పణసేతు కృతజ్ఞతానిధుల్.

వ. అట్లు కావ్యంబుఁబూర్తియై కొంతకాలమ్మువరకు ముద్రణ కాకుండను
టయు నొకానొక కారణంబున నేను మోర్జమపాటి కరిగి నివ
సించుటయు జరిగె, నచ్చట

ఉ. స్వామి పదార్చనారతుఁడు సాత్త్వికభావ్యుఁడు తంగెడాన్వయ
గ్రామణి మల్లికార్జునుఁ డొకానొకనాఁడు మదీయకావ్యమున్
బ్రేమ వెలార్చిచూచి వినుపింపుమటంచు వచింపఁ బండితుల్
పామరు లాలకింప నవభారతమున్ జదువం దొడంగితిన్.

ఉ. ఆదరణైక శీలులు కృపాత్ములు మోక్షమపాటివాసు లా
హ్లాదమతుల్ క్షమాగుణగణాఢ్యులు రెడ్డి కులావతంసముల్
నాదగు కావ్యగానము వినన్ జనుదెంచిరి నమ్రభావులై
సోదరులో యనన్ నెనరుజూపుచు నుల్లము పల్లవింపఁగన్.

వ. వారెవరన :

సీ. బాలిరెడ్డి సుతుండు పరమశాంతుండు చి
న్నారెడ్డి బాదమన్వయభవుండు
పెదనర్సిరెడ్డికిఁ బ్రియకుమారుండైన
గుణరాశి గంకరగోపిరెడ్డి
బకిరెడ్డి పుత్రుండు బాదమువంశుండు
శ్రీలఁ జెన్నలరారు బాలిరెడ్డి
స్ఫుటమూర్తియైన వేంకటరెడ్డి కొమరుండు
బాదమన్వయమాళి బక్కిరెడ్డి
ఆ. చిన్ననరిసిరెడ్డి కన్నకుమారుండు
హానిమిరెడ్డి యతని యనుజవరుఁడు
మాలకొండరెడ్డి మాన్యుఁడాయిర్వురుఁ
గంకరాన్వయులు వికాసమతులు.

సీ. నరిసిరెడ్డికిఁ గూర్చు నందనుండతుల వి
జ్ఞాని కంకర పెదస్వామిరెడ్డి
పెదవేంకటస్వామి ప్రియకుమారుఁడు దయా
శాలి కంకర చినస్వామిరెడ్డి
చిన్నచెన్నారెడ్డి కన్నపుత్రుండు స
ద్గుణరాశియౌ కోట కోటిరెడ్డి
చినవేంకటస్వామి తనయాగ్రజుఁడు శ్రిత
ప్రియుఁడైన కంకర పిచ్చిరెడ్డి
గీ. హానిమిరెడ్డి తనూజాతుఁడైన కామి
రెడ్డి కులమణి వేంకటరెడ్డి సుగుణి
పేరిరెడ్డి కుమారుండు మారమన్వ
యాబ్ధి శశధరుఁడననొప్పు హానిమిరెడ్డి.

క. బాశము లచ్చయ యను గుణ
రాశికిఁ గడుగూర్చు పుత్త్రరత్నమ్ము మహా
ధీశాలి నాగిరెడ్డి జ
యాశయుఁడు విశాలహృదయుఁ డాదరమతియున్.

మం. శ్రీరో[illegible] మన్వయ క్షీరాబ్ధివిధుఁడు
పాలితాశ్రితుఁడు సుబ్బారెడ్డిసుతుఁడు
రామలింగారెడ్డి రసికశేఖరుఁడు
వినయవర్తనుఁడు వివేకధనుండు
ఆయన యనుజన్ముఁ డాహ్లాదమూర్తి
వీరలింగారెడ్డి వితరణవర్తి.

ఆ. నాగిరెడ్డి కూర్మినందనుల్ మేషగం
వంశభవులు నాఁగ వరలుచున్న
శాంతమూర్తి కీర్తిశాలి సిద్దారెడ్డి
రమ్యగుణగణుండు రామిరె[illegible].

క. దారం వంశోద్భవుఁడు ను
దారగుణుఁడు నాగిరెడ్డి తనయుండు దయా
సారాత్ముఁడు వేంకటసు
బ్బారెడ్డి యనంగనొప్పు ప్రాజ్ఞవరుండున్.

గీ. రామిరెడ్డి తనూజుండు ప్రేమమూర్తి
మేటియనవెల్గు బాశము కోటిరెడ్డి
దొడ్డతనమును గను చిన్నారెడ్డి సుతుఁడు
బాశము కులోద్భవుఁడు చినబాలిరెడ్డి.

సీ. ఇడమగంటి కులోద్భవుఁడు నాఁగ వెలయు లిం
గారెడ్డి పుత్త్రుండు గాలిరెడ్డి
బోనముక్కల వంశుఁడైన కృష్ణారెడ్డి
నాగిరెడ్డిసుతుఁ డానందమూర్తి

దొడ్డమై తగు లోకిరెడ్డి వేంకటరెడ్డి
కొడుకు కుదారగుణుండు గోపిరెడ్డి
కూర్మి బక్కారెడ్డిఁగొన్న దత్తుండు వేం
కటరెడ్డి శీలము ఘనకులుండు,

గీ. భోగిరెడ్డ్యన్వయం డనురాగమూర్తి
వేంకటస్వామిరెడ్డియఁ విబుధుతనయుఁ
డై యలరు రామకోటిరెడ్డ్యభిధుఁ డింక
కొంద అరుదెంచి రాత్మ లింపొందుచుండ.

వ. పిదప

ఉ. అందఱుఁ గావ్యముఁ విని మహామదమందుచు నచ్చుగూర్ప లే
దెందుల కంచు నన్నడిగి హేతువెఱింగి దయామయాత్ములై
యందొకభాగముఁ వడి బయల్పడజేసిరి వారికీర్తి చె
న్నొందును గాక వారియెడ నుండునుగాక సమస్తసంపదల్.

# విషయసూచిక


ప్రార్థనాదికము i
కవి జన్మస్థలాదులు ii
షష్ఠ్యంతములు vi

(ఆదిపర్వము)

భరతఖండవర్ణన 1
భరతుని పరిపాలనము 3
పురాతన హైందవ నాగరికత 5
ఆర్యులు హిందూదేశముఁ జేరుట 7
ఆర్యులకు ద్రావిడులకు యుద్ధము 8
ఆర్యులు ద్రావిడులఁ బాఱఁద్రోలుట 9
ఆర్యుల స్వార్థ పరత్వము 10
నాఁడలవడిన దుష్టాచారములు 11
వర్ధమానవీరుఁడు - జైనమతము 12
బుద్ధుని జననము 13
సిద్ధార్థుఁడు - భయంకరదృశ్యములు 14
సిద్ధార్థుని మనోవేదన 15
సిద్ధార్థుని సర్వసంగ పరిత్యాగము 17
చెన్నుఁడు సిద్ధార్థుని వేడికొనుట 17
సిద్ధార్థుఁడు చెన్నునికి బోధించుట 19
సిద్ధార్థుఁడు సంన్యసించి మోక్షమార్గమెఱుంగుట 20
నందుల పాలనములు 22
అలగ్జాండరు దండయాత్ర 23
అలగ్జాండరు పురుషోత్తముల యుద్ధము 24
పురుషోత్తముని యపజయ కారణములు 26
అలగ్జాండరు సిగ్గుచేఁ బురుషోత్తముని సన్మానించుట 28
చంద్రగుప్త చక్రవర్తి పరిపాలనము ,,
అశోకుఁడు కళింగవీరులఁ జంపి పశ్చాత్తాపముఁ జెందుట 31
అశోకునకు వృద్ధమాత యెదురుపడుట 32
అశోకునకు బౌద్ధభిక్షు వగుపడుట 34
అశోకునకు బౌద్ధభిక్షువు బోధించుట 35
బౌద్ధభిక్షు వశోకునకు రాజధర్మమ్ము లుపదేశించుట 37
అశోకుని ధర్మపరిపాలనము 38
సంగులు - కణ్వులు 41
గుప్తరాజులు స్వర్ణయుగము 42
హర్షవర్ధనుని పరిపాలనము 45
శాతవాహనులు - పల్లవులు 46
చోళులు - చాళుక్యులు 47

యాదవులు - కాకతీయులు 48
ద్వివిధ పాండ్యులు 48
గజనీ మెహమద్ దండయాత్ర 50
ఘోరీ మెహమ్మద్ దండయాత్ర 52
రాణీసంయుక్త పృధ్వీరాజును వరించుట 53
పృధ్వీరాజు యుద్ధము 53
రాణీసంయుక్త యుద్ధమునఁ దండ్రిని దూషించుట 54
ఖిల్జీయులు, తుగ్లకులు, సయ్యదులు, లోడీలు 55
మొగలు సామ్రాజ్యము 56
అక్బరుచక్రవర్తి పరిపాలనము 58
జహాంగీర్, షాజహాన్, ఔరంగజేబ్ ప్రముఖులు 59
శ్రీ కృష్ణదేవరాయలు 60
రాణాప్రతాపసింహుఁడు 62
శివాజిచక్రవర్తి ధైర్యసాహసములు 63
వాస్కోడిగామా భరతఖండముఁజేరుట 66
డచ్చివారు పోర్చుగీసువారివర్తకము దగ్గించుట 67
ఆంగ్లేయులకు ఫ్రెంచివారికిఁ గలహము — 68
ఈస్టిండియాకంపెనివారు 70
లండన్ ప్రభుత్వ విచారణ 71
ప్లాసీయుద్ధము 73
రహస్యవిప్లవ సందేశము 74
సిపాయికలహము 75
ఝాన్సీలక్ష్మి శౌర్యసాహసములు 77
విప్లవాపజయములు, తత్కారణములు 78
శ్రీ విక్టోరియారాణి పట్టాభిషేకము 80

## స భా ప ర్వ ము

రాజప్రతినిధుల పాలనము 83
రాణి వాగ్దాన భంగములు 84
సాంఘిక దుష్టాచారములు 87
భారత వైతాళికులు 88
భారత పురాతనవైతాళికులు 91
రామకృష్ణపరమహంస 93
స్వామి వివేకానందుడు 93
విజ్ఞానబీజస్థాపన ప్రయత్నములు 94
కలకత్తాకు సుత్తరము 97
గొర్నర్ డఫరిన్ హ్యూం సంభాషణ 98
మహాసభా ప్రయత్నములు 99
సభాప్రతినిధులు, ప్రముఖులు 100
ప్రథమ భారతమహాసభ 101

# ప్రార్థనాదిక్రమము

ఉ. శ్రీదరహాసచంద్రికలఁ జిమ్ముచు విస్తృతజీవకోటి నా
హ్లాద సుధాతరంగముల హాయిగనూఁచుచు నేవుగాంచు స
ర్వోదయమూర్తిఁ దాత్త్వికమహోజ్జ్వలశక్తులకుంబునాదియై
యాదికనాదియై యలరు నప్పరమాత్మనెదం దలంచెదన్.

ఉ. భూతదయాసమేత పరిపూర్ణకళాపరిపూత విశ్వవి
ఖ్యాత సుజాత సాత్త్వికవికాసపరీత యఖండవైభవ
స్ఫీత సమస్తధర్మసముపేత నిజాశ్రితపారిజాత భూ
మాతల మాత మా భరతమాత సుఖంబిడుగాత మర్మిలిన్.

ఉ. ఆకుల మీకులంబనక యామత మీమతమన్న భేదమున్
జేకొనఁబోక శాంతిసహ-జీవనపావనయాత్ర కడ్డుగా
దూఁకక వర్గవాదములతో విహరింపక దాంభికక్రియల్
తాఁకక లోకబాంధవులఁ దన్నెడి సోదరమైత్రి నెన్నెదన్.

ఉ. మాయలుమర్మముల్ పెనుమమూరములై వడిఁదాఁకినన్ ధృతిం
బాయక మూఁడువన్నియల భాసిలి బిడ్డల స్వీయశీతల
చ్ఛాయల చాయలన్ నడిపి శాంతిరణంబునఁ బేరుగన్న జా
తీయపతాక ముంగడ విధేయుఁడనై కయిమోడ్పులిచ్చెదన్.

ఉ. ప్రాణములొడ్డినిల్చి పరబాధలనన్నిటి సైఁచి బాణమున్
దూణమురోసి ధీబలముతోఁ జిరదాస్యముఁబాసి దేశమా
తృత్రాణము దీర్చివైచి జయతేజములన్ వెలయించు వీరగీ
ర్వాణుల వీరమాతల నిరంతరమున్ స్మరియింతు భక్తిమై

ఉ. ధూర్తుల వాదభేదములతో భ్రమ చెంది నిజస్వరూపమున్
బూర్తిగ వీడియోడి చెడిపోయి తపించు సమాజలక్ష్మి భా
వార్తినణంపఁగా నుదయమంది జయంబునుగొన్న సంఘ సం
స్కర్తల సత్ప్రవక్తల విశాలహితోక్తుల నాశ్రయించెదన్.

ఉ. శాంతిపదార్థమున్ విరియఁజల్లుచు నైతికశక్తితో భయ
భ్రాంతులఁ ద్రోసిపుచ్చుచుఁ బరస్పరమైత్రికి దోహదంబుగా
సంతతమున్ వెలుంగుచు నిజంబు వచించెడి పంచశీల సి
ద్ధాంతవచస్సుధామధురధారలఁ గ్రోలి తరింతుజన్మమున్.

సీ. నన్నెచోడనిఁ బ్రార్థనమొనర్చి యాంధ్రభా
రతకవిత్రయము సమ్మతిఁ దలంచి
శ్రీనాథుఁ బోతన్న సేవించి మా రుద్ర
కవిపాదపద్మముల్ కడిగి మ్రొక్కి
శ్రీకృష్ణరాయ ధాత్రీనాయకుని వేడి
రామలింగన్న సూరన్న నెంచి
పెద్దనాదులఁ గూర్మిఁ బేర్మి నారాధించి
భట్టుమూర్తి కవీంద్రుఁ బ్రస్తుతించి

వీరశరభేంద్రకవికి జోహారు లిచ్చి
చేమకూరకవీశుఁ బూజించి మివుల
లలితకవితా కళాఢ్యు మొల్లను నుతించి
ధైర్యమువహించి నవభారతము రచింతు.

క. అనుగుం దమ్మునివలె నన్
గనుచు సదా మామకీన కవితాభ్యుదయం
బును గోరెడి "యః భిసవ తి
క్కన" సీతారామమూర్తి కవిఁ గీర్తింతున్.

గీ. తెనుఁగు నుడికారమునఁ దీర్చిదిద్ది యాత్మ
కథ రచించిన కవికులాగ్రణి యతండు;
లోకమాననఁ గనకాభిషేక గరిమఁ
గాంచి యసదృశ యశమునార్జించె నతఁడు;

## కవి జన్మ స్థ లా దు లు

క. తలలన్ మార్చెడి వారలు
నెలవులఁదప్పించు పరమనీచులు భువిపైఁ
గలరందుచేత నాస్థల
కులమత గోత్రాదికంబుఁగూర్చి వచింతున్.

చ. కలవుకదా! మహాభరతఖండమునన్ వివిధప్రదేశముల్
తొలఁగని భోగభాగ్యములతో నవరత్నశిలాకణంబులన్
దొలఁకుచునుండు పెన్ గనులతో నలరారుచు; నందు నందముల్
చిలుకుచువెల్గు మా తెలుగుసీమ కళామహిమాభిరామయై.

ఆ. ఖ్యాతినందుకొన్న యీ తెల్గుసీమలో
ఘనులఁ దిక్కనాది కవులఁగాంచి
సురుచిరప్రశస్తి శోభిల్లు గుంటూరు
మండలమ్ము వాణి కుండలమ్ము.

క. ఆ మండలమున, వీర
గ్రామణులకు వివిధకవిశిఖామణులకు సం
ధామ మనఁనొప్పి పలునాఁ
డీసీమ, ఫలవనాభిరామ, చెన్నలరారున్.

సీ. నాగానదీ చంద్రభాగా ప్రవాహముల్
పచ్చగడ్డలఁ దన్నిపట్టిపాఱఁ
గండనిండిన పండుకాయ రేగడిగడ్డ
ముక్కారు పంటలఁ గ్రక్కుచుండ

నాలుగేదెలు వేనవేలాలుగాలమ్ము
తఱపిఁ జెందని పాడి యురలఁ జేయఁ
గమనీయగురుశిలాఖనిజసంపన్నిధుల్
సకలదేశముల కుత్సాహమిడఁగఁ.

గీ. బలుకులవెలంది, కలుములపడఁతి కులుకు
లలర నిత్యము దలవాకిళుల మెలంగ
ఖండఖండాంతరముల విఖ్యాతిఁ గాంచె
నవకళారామ మా పలునాటిసీమ.

గీ. విశ్వ విద్యాలయములతో వివిధ బౌద్ధ
శిల్పరేఖలతో సుప్రసిద్ధిఁ గనిన
విజయపురలక్ష్మి కిక్కయై వినుతినందె
విమలగుణమణి పల్నాఁటి వీరధరణి.

సీ. దొడ్డవారు నుతింప రెడ్డినాయకురాలి
వీరధర్మజ్యోతి వెలిఁగె నెచట
ఘనులొప్ప బ్రహ్మనాయని చాపకూటి సి
ద్ధాంతంబు విజయంబు నందెనెచట
జగమెన్న సంగడీంద్రగు బాలచంద్రాది
యువసింహుల ప్రతాప ముబికె నెచట
సమరథుల్ మెచ్చఁ గన్నమదాసు సేనాధి
పత్యంబు సత్కీర్తి వడసె నెచటఁ
గీ. దగదు తగదని వలవఁ దత్తఱము నాఁపి
మగని యుద్ధమునకుఁ బంపి సుగతిఁ గన్న
మగువ మాంచాల యెచట జన్మంబునందె
నట్టి పలునాఁడు నేఁ బుట్టినట్టి వీడు.

సీ. రసవత్ప్రబంధరాడ్రచనాధురీణుఁడౌ
భట్టుమూర్తినిఁ గన్న ప్రౌఢురాలు

## కవిజన్మస్థలాదులు

కవిచక్రవర్తిఁ బింగళి సూరనామాత్యుఁ
గడుపారఁగన్న బంగారుతల్లి
తలఁచి ఛందశ్శాస్త్ర సరణిఁ దెల్పిన యప్ప
కవిచంద్రమునిఁ గన్న గణ్యహృదయ
విశ్వవిశ్వజ్ఞ నేలేశ్వరోపాధ్యాయుఁ
బ్రసవించినట్టి శుంభత్కళాఢ్య

గీ. బ్రహ్మమూర్తులఁ బెందోఁటపట్టణాధి
పతుల శిల్పులఁగన్న తపఃప్రభావ
సకలవిద్యాసమేత యశఃప్రపూత
దిగ్విజయజాత, పల్నాఁటి దేశమాత.

గీ. అలమహాయాన బౌద్ధసిద్ధాంతములను
ప్రజకు బోధించినట్టి కృపాపయోధి
సిద్ధనాగార్జునుఁడు వసించిన పవిత్ర
పర్వతము నాదియను వీడు పల్లెనాఁడు.

ఉ. ఆ పలునాఁటిగడ్డపయి నందిము చందము నిండివెల్గు దా
చేపలి; దానిచెంత విలసిల్లుచు కేసనపల్లె; దానికిన్
దాపున యామ్యదిక్సరణిఁ దక్కెళపాడలరారు నచ్చటన్
గాపురముందు మేము గుణగణ్యులు తాతలనాటినుండియున్.

క. శ్రీ విశ్వకర్మ కుల పా
రావారసుధాకరుఁడఁ బరాత్పరు నెపుడున్
సేవించెద, నా మతమా
శైవము నేఁదిరుగునది ప్రజాస్వామ్యమునన్.

ఉ. గౌరవమూర్తియై కులశిఖామణియై శివభక్తుఁడై మహో
దారచరిత్రుఁడై మణియుదారయి వెల్గిన మల్లికార్జునుం
డారయ మత్పితామహుఁ డుదాత్తచరిత్ర పవిత్రగాత్ర భా
గీరథి మత్పితామహి, సుఖించిరి వారతివైభవంబునన్.

సీ. కన్నతల్లి సుసాధ్వి కవయిత్రి గుణబింబ
గురుకళానికురుంబ కోటమాంబ
తండ్రి సంగీతవిద్యావేది హరభక్తుఁ
డార్యుండు రాజలింగాభిధుండు
అగ్రజుల్ శతవధానాష్టావధాన పా
రంగతుల్ ప్రభులింగ, లింగకవులు
ఇలువేల్పు భక్తవత్సలుఁడు వేములవాడ
రాజేశ్వరుం డర్ధరాజధరుఁడు.

గీ. మేనమామలు తాత్త్వికజ్ఞాననిధులు
వరకవీంద్రులు కొండాన్వవాయభవులు
గోత్రపతి లోకహిత తపఃకోవిదుండు
ధర్మశాస్త్రార్థఖని భరద్వాజమౌని.

శా. ప్రాచీనాంధ్రకవిత్వతత్త్వవిధులం బాటించి నాకున్న వి
ద్యాచాతుర్యముఁ జూపి యీ చరిత వ్రాయంబూనితిన్ వీరభ
ద్రాచార్యుండను కన్నెకంటి కులుఁడన్ ధాత్రీజనస్తుత్యమై
యాచంద్రార్కము వెల్గుఁగాత మిది యుద్యత్కీర్తి పాత్రమ్ముగన్.

చ. అఱువదియేండ్ల భారత మహామహితోద్యమ గాథలన్నిఁటిన్
వరుసగఁగూర్చి పద్యములవ్రాయుట సాధ్యముకాదు కాన నే
నెఱిఁగినయట్లు చేర్చి రచియించితిఁ గావ్యముఁ బండితోత్తముల్
సరసులు సత్కవీంద్రు లిది సైఁచిననున్ గరుణింత్రుగావుతన్.

షష్ఠ్యంతములు

క. స్వాతంత్ర్యార్జనమునకై
జాతీయమహోద్యమముల సాగించిన మా
తాతలకుఁ దండ్రులకు మా
మాతలకున్ భ్రాతలకును మహితాత్ములకున్.

క. మితవాదుల కతివాదుల
కతులిత దీక్షాసమన్వితాత్ములకు దయా
రతులకు మానవసేవా
వ్రతులకు నభ్యుదయభావ వర్ధిష్ణులకున్.

క. జవసత్వంబుల నసువుల
నవలీలన్ ధారవోసి యవనీసేవా
సవనమున విజయమందిన
యువజనసింహులకు వీరయువతీతతికిన్.

క. కారాగృహములఁబడి సం
సారంబులరోసి పోరి స్వాతంత్ర్యకళా
భారతమును నెలకొల్పిన
వీరశిఖామణులకుం బవిత్రాత్ములకున్.

క. తమపతులను దమసుతులను
దమతమ పుత్రికలఁ దల్లిదండ్రుల నఖిలో
ద్యమములఁజేరిచి పోరిన
రమణీమణులకు మనోహరగుణాఢ్యులకున్.

క. జపతపముల వీడి త్రివ
ర్ణపతాకలఁబట్టి శాంతిరణమున స్వాతం
త్ర్యపథంబుల సాధించిన
యపరబ్రహ్మలకు యతుల కమలాత్ములకున్.

వ. అంకితంబుగ నాయొనర్పంబూనిన నవభారతంబను భారతజాతీయో
ద్యమచరిత్రమునకుఁ గథాక్రమంబెట్టిదనిన.

# నవభారతము

## ఆదిపర్వము



రమ్యగుణగణాలం
కారా! భారతకుమార! కరుణాంచితదృ
క్సారా! సువిచారా! నవ
భారతమున నలరు నాదిపర్వము వినుమా! **1**

### భరతఖండ వర్ణన

చ. కలదుకదా మహాభరతఖండ మఖండకళాప్రపూర్ణమై
విలసితరూపసంపదల విస్తృతమై సమశీతలోష్ణమై
కలితమనోహర ప్రకృతికల్పితమై మన మాతృదేశమై
చెలువలరారువన్నెలుచిన్నియలొప్ప ధరాతలంబునన్. **2**

సీ. దివ్యగంగాపగాది నదీనదముల కా
వాస మే యంబ పద్మాసనంబు
లలితశిల్పకళాద్యలంకారములకు నా
స్థాన మే జనని నెమ్మోని సౌరు
కనకరత్నశిలాది ఖనిజసంపదల కా
ధార మే యమ్మ బంగారు కడుపు
నానాప్రధానవిజ్ఞానభాగ్యముల కా
వాల మే తల్లి ముత్యాలశాల

గీ. దానధర్మ ప్రముఖ సంప్రదాయములకు
నాశ్రయం బే సవిత్రి సత్యాంతరాత్మ
యా సుగుణపూత సకలవిద్యాసమేత
పాలితాశ్రితసంఘాత భరతమాత. **3**

క. ఆ మాతృభూతలము రస
ధామంబై సకలసుమలతాదామంబై
కోమలమై ఫలసస్య
శ్యామలమై యలరు సర్వసాఖ్యము లిడుచున్. 4

వ. మఱియు 5

ఉ. పుణ్యసరోవరమ్ములుఁ దపోనిలయమ్ములు దైవశిల్ప లా
వణ్యకళావిరాజితసువర్ణశిలాలయముల్ ఫలప్రదా
రణ్యసమూహముల్ గురుధరాధరముల్ చెలువార జీవకా
రుణ్యమయప్రవృత్తి నలరున్ భరతావని సర్వకాలముల్. 6

చ. పరమపతివ్రతామణులు భక్తవరేణ్యులు పండితుల్ కవీ
శ్వరులు మహారసజ్ఞులు విశాలమతుల్ కృషికుల్ కళాధురం
ధరులు మతప్రవక్తలు బుధప్రవరుల్ గురుశేఖరుల్ నిరం
తరముజనించుచుందురుకదా మన మాతృధరాతలంబుపై. 7

చ. మతసహనమ్ముతో మధురమంజులవాఙ్మయసేవనమ్ముతో
నతిథులపూజతో భగవదర్చనతో సకలార్థసాధన
వ్రతతులతో జివన్ దనరు పంటవలంతులతోఁ బవిత్ర భా
రతజనయిత్రి నిల్పికొనురా! తనకీర్తి దిగంతరంబులన్. 8

క. మన భారతఖండమునకు
మనకున్ మన సంస్కృతికిని మనలక్ష్మికిఁ బె
ట్టనికోటలు నిశ్చయముగ
వనధులు హిమవన్నగములు వలయం బుంటన్. 9

క. ఈ ధరణీ తలమున నే
బాధలు పొడసూపఁబోవు పైపైఁగఱవుల్
వేధించఁబోవు ప్రజలకు
గోధనసంతతులు కొల్లకొల్లగ నుంటన్ 10

సీ. అంగవంగత్రిలింగాదిప్రదేశముల్
సురుచిరాకృతులతోఁ బరిఢవిల్ల
కాశీగయాది ముఖ్యక్షేత్రరాజముల్
దివ్యప్రభలఁదాల్చి తేజరిల్ల
వేదవేదాంగాది వివిధవిద్యానిధుల్
విజ్ఞానకాంతులఁ విరియఁజల్ల
ఫలపత్రపుష్పవృక్షలతాప్రకృతిలక్ష్మి
పల్లవద్యుతులతో నుల్లసిల్ల
గీ. సర్వసౌఖ్యంబులును సదాచారములును
వృత్తిధర్మంబులును గళావిధులు వెలయ
నవ్యయాధ్యాత్మిక ప్రభావాంచితముగ
సతము వర్థిల్లుచుండు భారతధరిత్రి. 11

వ. అదియునుంగాక 12

మ. చలనంబందని సత్యసంధులు హరిశ్చంద్రాది షట్చక్రవ
ర్తులుపాలించినరత్నగర్భ మహితాత్ముల్ ధర్మమూర్తుల్ విని
ర్మలభావుల్ భరతాదిషోడశమహారాజేంద్రు లుద్యద్యశుల్
కొలువుందీర్చిన పుణ్యభూమి భరతక్షోణీస్థలం బెన్నఁగన్. 13

భ ర తు ని ప రి పా ల న ము

వ. అందు 14

చ. నిరుపమశేముషీధనుఁడు నిశ్చలమూర్తి సుధాకరాన్వయా
భరణుఁడు ధర్మవిజ్ఞుఁడు విభాకరతేజుఁడు శౌర్యరాశియౌ
భరతనృపాలమౌళి పరిపాలనచేసిన దాది య వ్వసుం
ధర ధరియించికొన్నదిగదా భరతావనియన్న నామమున్. 15

ఉ. ఎందఱు రాజచంద్రులు మహీతలనాయకులైరితొల్లి నేఁ
డెందఱు చక్రవర్తులననేలిరికూలిరి చూచుచుండ వా
రందఱనామముల్ గొనియెనా! విడలేక ధరించియుండెనా
హైందవరాజ్యలక్ష్మి భరతాధిపుఁ డెంతటిపుణ్యమూర్తియో! 16

ఉ. ఏ సుముహూర్తమందు ధరణీశుఁడు నూతనహేమరత్నసిం
హాసనమెక్కెనో స్థపతులందఱు దీవనలీయ వాసముల్
గాసములందునట్టి పదకంబులఁగూర్చి ప్రజానురాగవి
శ్వాసములందెఁ బొందె సుయశశ్శరదిందువికాసచంద్రికల్. 17

క. భావింప రాజు ప్రజలకు
దేవుండో సేవకుండో తెలిసిన ఘనుఁడా
భూవరుఁడు సత్యనిరతుఁడు
కావున నాతనికి యశము కల్గకయున్నే. 18

క. పన్నులఁ గడుఁబెంచుచు నా
పన్నులఁ జేయఁడు ధరాధిపతి పౌరుల, సం
పన్నుల నిరుపేదల నుతిఁ
గన్నాఁడు సధర్మమూర్తి గన్నాఁడు హితా! 19

క. వారమ్ము వారముఁ బ్రజా
వారము దరిఁజేరి సపరివారమ్ముగ నా
భూరమణుఁడు వారికిఁగల
కోరిక లివి యనుచుఁ దెలిసికొని సమకూర్చున్. 20

క. ఉంటకుఁ దింటకుఁ దాలిచి
కొంటకు వసతులను రాజు కూరిచె నవియే
కుంటుపడినచోఁ బౌరులు
తుంటరి పాలన మటంచు దూఱెదరుగదా. 21

క. జనముల కష్టసుఖంబులు
తన కష్టసుఖంబులంచుఁ దలఁపక సింహా
సనముల నిలఁగలరే యే
మనుజాధిపులైనఁ బెక్కుమాట లిఁకేలా ! 22

గీ. కార్మికుల కాతఁడొక్క బంగారుకొండ
కర్షకుల కాతఁడొక మహాకల్పతరువు
బుద్ధిజీవుల కతఁడొక్క పుణ్యధనము
భరతునకు సాటి భరతుఁడే భవ్యహృదయ ! 23

గీ. నిజ కళారూప దాన సన్నియమ శౌర్య
దీప్తి ధనముల భరతధాత్రీధవుండు
రాజు రతిరాజు వాహినీరాజు ధర్మ
రాజు మృగరాజు దినరాజు రాజరాజు. 24

క. భరతుఁడు పరిపాలించిన
ధరణి యగుట నతఁడు ధర్మతత్పరుఁడై సు
స్థిరయశ మార్జించుట నా
కరుణాకరుపేర భరతఖండం బయ్యెన్. 25

వ. ఇఁకఁ గథ నాలకింపుము. 26

పురాతన హైందవ నాగరకత

ఉ. ఆర్యులు రాకముందు భరతావని యందు వసించు మానవుల్
శౌర్యధనుల్ కృపాత్ములు విశాలమతుల్ పశుపోషణక్రియా
ధుర్యులు కష్టజీవులు బుధుల్ ప్రతిభానిధు లాశ్రితావనుల్
క్రౌర్యము చౌర్య మెన్నఁడెఱుఁగన్ దలపోయని సాధు సత్తముల్.

చ. ఎఱుఁగరు యుక్తివాదములు హింస సహింపరు స్వార్థచిత్తులై
తిరుగరు మంచిఁగూర్చ వెనుదీయరు స్వప్నమునందునైన సో
మరితనమూన రన్నిట సమర్థులు వ్యర్థపు జీవితంబులన్
నిరసనచేయుచుందురు జనింపదు వారి కసూయ యెన్నఁడున్. 28

వ. మహేంజోదారో హారప్పాయను స్థలంబుల బయల్పడిన ప్రాచీ
న పత్తనశిధిలంబులవలనను సాధనములవలనను వారి జీవిత
విశేషంబుల గ్రహింప సాధ్యమగుఁగాన వినుము. 29

సీ. వ్యవసాయసాధనవ్రతతి వెల్వడుటచే
మంచిపంటలను బండించిరనియు
పారుతప్పని గృహద్వారసంతతు లుంట
సర్వార్థవాస్తుశాస్త్రజ్ఞులనియు
వెండి బంగరు నగల్ వెలసియుండుటచేత
నవనాగరకతఁ గన్నారలనియు
విలసితాక్షరముద్రికలు బయల్పడుటచే
జదువు సాములు నేర్వఁజాలిరనియు

గీ. బహుశిలాలింగములు కానఁబడుట వలన
శైవులనియు మహాతపశ్శాలులనియుఁ
దెలియవచ్చును దీన సందియములేదు
నాఁటి మానవు లగ్రజా! మేటి మగలు. 30

చ. అవిరళదానధర్మపరు లవ్యయశౌర్యకళావిశారదుల్
రవిసమతేజు లద్భుతపరాక్రమశాలులు సత్యవాగ్వ్రత
ప్రవరులు స్వప్రకాశులు కృపారసవార్ధులు శేముషీనిధుల్
ద్రవిడులు వృద్ధినందుచు ముదమ్మువహించుచు నుండ నత్తరిన్.

## ఆర్యులు హిందూదేశము చేరుట

గీ. ఆర్యు లనువారు మధ్యాసియానివాసు
లచట భూసారమణఁగాఱినందువలనఁ
జేరవచ్చిరి హైందవసీమ కపుడు
తమ మతాచారములు వెంటఁ దరలిరాఁగ. 32

వ. వచ్చి యందందుఁజేరి నివసించుచు 33

సీ. ఫల పత్ర పుష్ప సంభరిత వృక్షములతో
విలసిల్లు ఘనవనమ్ములను జూచి
యాఱుకాలములు సస్యశ్యామలమ్ములై
యలరారు కేదారములను జూచి
కడవలఁగాదెలన్ గడునిండి తియ్యనఁ
జెలరేఁగు పాడిపంటలను జూచి
కండలఁ నిండి పిక్కలు ఱెక్కలు నెసంగ
నెలకొన్న పశుసంతతులను జూచి

గీ. యచటివా రందు భోగభాగ్యములఁ జూచి
వారికింగల్గు వసతుల వరసఁజూచి
తగిన దేశం బటంచుఁ జిత్తములనెంచి
నెలకొనిరి గుంపు లగుచు నార్యులు సుధీంద్ర! 34

క. తమ చుట్టపక్కములతోఁ
దమ కండగనిల్చు స్వీయదాయాదులతోఁ
దమ మిత్రవరులతో దే
శము నిండిరి యార్యవరు లసంఖ్యాకులుగన్. 35

ఉ. ఆదిమవాసు లార్యులకు నాదట నాశ్రయమిచ్చి మట్టు మ
ర్యాదలతోఁ జరించు సమయమ్మున సాగఁదొడంగె యజ్ఞ ధ
ర్మాదులు వానియందుఁ బశుహత్యలు; కావున హింససైఁపఁగా
రాదని వాదులాడిరి పురాతను లంత దయాసముద్రులై. 36

ఆర్యులకు ద్రావిడులకు యుద్ధము

ఉ. పాపములేదు దీన నని పల్కెదరార్యులు వీరలో మహా
పాపమటంచుఁ బల్కెదరు భంగమొనర్తురు యజ్ఞకార్యముల్
సైఁపక హింస, నయ్యెడల సంభవమయ్యె విరోధముల్ మన
స్తాపములేమి సెప్పెద బుధా! రణముల్ సమకూరె నాపయిన్.

వ. దేశవాసులు స్థానబలంబులతోడను శౌర్యధైర్యసాహసంబులచేతను బశుహత్యాయజ్ఞముల ధ్వంసముచేయఁదొడంగిరి. పిమ్మట

క. దేశీయుల వంపఁగ నా
వేశమ్ములఁదాల్చి యార్యవీరులు తమ భూ
మీశులఁ గోరిరి వీరల
నాశన మొనరించుటయు ఘనంబను యుక్తిన్. 39

క. గురుభక్తిఁ జూపుటకు వా
రరుదెంచిరికదలి మారణాస్త్రమ్ములతోఁ
బరిపరివిధముల నార్యులఁ
బరిరక్షణచేయ నాదివాసులఁ ద్రోయన్. 40

వ. మహాధనుర్ధరులును రణకళావిశారదులు బలాఢ్యులైన యా నరేంద్రుల యండదండల మరల యజ్ఞంబులు ప్రారంభింపఁబడుట వీక్షించి దేశీయవీరులు పశుసంరక్షణార్థంబు తుదివఱకుఁ బోర సమకట్టి యేకదీక్షతో నుండుతతి 41

గీ. సాగినవి యజ్ఞములు సాధుజంతువులను
బట్టి తెచ్చుచునుండిరప్పట్టు నందుఁ
గదలి రాదిమవాసు లఖండబలులు
పసుల రక్షించుకొనుటకు దర్పమ్ములొప్ప. 42

క. తారసిలి రిరు తెగలవా
రా రణములు జరిగినవి భయంకరములుగన్
మారణశస్త్రమ్ములతో
ఘోరాకారములతోఁ బ్రకోపమ్ములతో. 43

ఉ. పౌరుషవంతులై, బెదరిపాఱక యార్యులఁదాఁకి జంతుసం
హారము నాఁపఁజూచిరి మహానుభావు లాదిమవాసు లంత నా
యా రణరంగసీమల జయంబువహించిరి కాని శత్రువుల్
పోరుట మానరైరి తమ భూపతు లండగ నిల్చుచుండుటన్. 44

ఆర్యులు ద్రావిడులఁ బాఱద్రోలుట

వ. శత్రుసమూహమ్ము మిక్కుటమ్మగుటయు వారు నూతనాస్త్రం
బులఁ బ్రయోగించుటయుఁ గనుంగొని యిఁక లాభంబులేదని
తలంచి యయ్యాదిమవాసులు 45

ఉ. ఓడి పరాభవాగ్నులకు నోర్వక పల్లెలఁ బట్టణంబులన్
వీడి సమస్తసంపదల వీడ్కొని మాతృధరాతలాదులం
గూడ త్యజించి లేచి యిరుగుం బొరుగుం గలవారితోడ న
ల్లాడుచుఁ బోవసాగిరి మహాటవులంబడి రిక్తహస్తులై. 46

వ. విజయ సంరంభముతో నార్యులు రాజ్యము నాక్రమించికొని కట్టు
దిట్టమ్ముల నేర్పఱచి యమాయిక ప్రజలలోఁగఁదీసికొని తమ
తమ మతప్రభావమ్ములఁ బ్రసరింపఁజేయఁ గడంగిరి. 47

## ఆర్యుల స్వార్థపరత్వము

చ. చదువుల నేర్వ రా దితరజాతులు నేర్చినఁగాని వేదముల్
చదువుట ఘోరపాపము నిజం బిది తప్పినవాని వీనులన్
బొదలఁగ సీసమున్ గరఁగిపోయుట శిక్ష యటంచు నెంతయో
బెదరు జనింప నీమములఁబెట్టిరి పెద్దఱికంబుఁ జేకొనన్. 48

గీ. ఆర్యులకుఁ దప్ప యజ్ఞకర్మాదికమ్ము
లన్యుల కనర్హము లటంచు నాజ్ఞ నిడిరి
యాజ్ఞ నిడుటయ కాదు తదన్యులెల్ల
దాసు లనిచెప్పి శబ్దబంధముల నిడిరి. 49

గీ. ఆర్యు లాచరించు నపరాధముల కింత
శిక్ష లేదటంచుఁ జెప్పికొనిరి
యన్యు లాచరించు నాగములకు మహా
శిక్షలన్ విధింపఁ జెల్లు ననిరి. 50

మ. అలనాఁ డార్యుల వాక్చమత్కృతులతో నస్పృశ్యతాదోషముల్
కులభేదంబులు వర్గభేదములు తగ్గుల్ మొగ్గు లెన్నెన్నియో
చెలరేఁగెన్ జెలరేఁగి క్రమ్మికొనె నిస్సీ! భీతచేతమ్ములన్
వలలన్ జిక్కినపక్షులైరి జనముల్ వ్యాపించె దుర్భావముల్. 51

క. నెలకొల్పిరి చట్టమ్ముల
నిలిపిరి తన్నియమములను నేర్పుగఁ బ్రజలన్
బలుతెఱఁగుల నధిపతులై
పలుకుబడిం గూర్చికొని రుపాయంబులతో. 52

చ. అఱమరలన్ మతాధిపతులై మతబోధకులై మతక్రియా
పరులయి సర్వసంఘపరిపాలకులై స్వజనాభిమానులై
యొరులఁ దిరస్కరించుచు మహోచ్ఛదశన్ విహరించు నార్యశే
ఖరుల నెదుర్కొనంగలుగు గణ్యుఁ డొకండును లేఁడు నాఁడటన్.

### నాఁడలవడిన దుష్టాచారములు

వ. ఇట్లుండు నక్కాలంబునఁగల ప్రజలు జంతుహింసాయజ్ఞమ్ములఁ జూచుచుఁ దాము నట్లాచరింపఁ దలంచి వారి నాశ్రయించుటయు నార్యులు వారిఁ దిరస్కరించి మీకు యజ్ఞము సేయు నధికారము లేదని నుడివి క్షుద్రదేవతల కొలుపులు మీకు దగినవి యని నిరూపించుటయు జరిగెఁ బిమ్మట 54

చ. నరులకు శక్తిపూజ లనినన్ ముద మెక్కువ యయ్యె జాతరల్
జరుగఁదొడంగె నందు నరజంతుబలుల్ మితిమీఱె మానవుల్
కరుణకు దవ్వులందుఁ దిరుగన్ సమకట్టిరి లోకమే భయం
కరముగఁదోఁచె సాధుజనకంటక మయ్యెను దేశ మక్కటా ? 55

ఉ. తామస మావరించె వసుధాస్థలమెల్లఁ బవిత్రసోదర
ప్రేమనశించె సాధులకుభీతిజనించె నమాయికప్రజల్
పామరులైరి లోకము నపాయకరస్థితి క్రమ్మసాగె ముం
దేమొ ? యటంచుఁ జింతఁబడి రెల్లరు నుల్లము తల్లడిల్లఁగన్.

వ. భయంకరమగు నా సమయమ్మున సత్యధర్మములతో సకల ప్రజల నుద్ధరించి లోకమున శాంతినెలకొల్ప మహామహు లనేకులు ప్రయత్నించి విఫలమనోరథులగుటయు జరిగెఁ బిమ్మట 57

### వర్ధమానవీరుఁడు - జైనమతము

క. వైశాలీపురమునఁగల
ధీశాలి నతాన్వయుండు దివ్యాత్ముఁడు స
త్యాశయుఁడు మహావీరుఁడు
దేశోపద్రవము నణఁచ దీక్షవహించెన్. 58

వ. అతండు నాయకసత్తాకరాజ్యవాసియు సుక్షత్రియవంశసంజాతుండును సర్వసుగుణగణాలంకృతుండును యశోదాప్రియుండునై యుండి 59

చ. చదివి సమస్తశాస్త్రములసార మెఱింగి పవిత్రధర్మసం
పదల గ్రహించి లోకమును బాఱఁగఁజూచి విపత్కరస్థితిక్
వదలిచి సోదరప్రజలవైఖరులన్ సవరించి సత్కృపా
హృదయులఁ జేయనెంచి చెడుగెల్ల హరింపఁదలంచి దీక్షమై.

వ. సర్వసంగపరిత్యాగం బొనర్చి తన ముప్పదియవ యేఁట సంన్యసించి పారసనాథు లను యతిచంద్రములసాంగత్య మొనరించి వత్సరద్వయం బట వసించి సమస్త మెఱింగి యాదార్థ హృదయుండై కదలి 61

క. మానావమానములు ప్రతి
మానవునకు సమములంచు మదిఁదలఁచుట సు
జ్ఞానము దానింగొనఁగల
మానవులకు నంటఁబోవు మాయలు గీయల్. 62

క. తా నితరుల హింసించుట
తా నెల్లెడ నేత నంచుఁ దలఁచుట తానే
మానవుఁడ నంచు నెంచుట
యేనాటికి నైనఁ గూడ దెవ్వనికైనన్. 63

వ. మఱియు భగవానుఁడు సాక్షీభూతుఁ డరూపకుం డతీతుఁ డనియు మానవుల రక్షించునవియు శిక్షించునవియు వారి వారి సత్కృత్యంబులు దుష్కృత్యంబు లనియు సర్వజీవు లనాదు లవినాశు లనియు వేదంబులు పౌరుషేయంబు లనియుఁ బుణ్యాత్ము లాగమీంద్ర లోకంబున కరుగుదురనియు నందు సర్వేశ్వరుండు గలఁడనియు

బోధించునటుల నొకసంస్థను స్థాపించి లోకంబును సంస్కరింపఁ దొడంగె. అమ్మహాపురుషుని బోధయందు జీవహింసకుఁదావు కనంబడదు. అమ్మహానుభావుఁడు 65

క. లోకముల గెల్చి మాయా
లోకనముల ద్రుల్చి సాధులోకావనదీ
క్షాకాంక్షనిల్చి విజయముఁ
జేకొని జినుఁడనఁ బ్రసిద్ధిఁ జెందెనుజుమ్మా! 66

మ. అతఁడే జైనమతాది పూరుషుఁడు దివ్యజ్ఞానపారీణుఁడై
సతతాహ్లాదచరిత్రుఁడై మహి నహింసావాదియై సూనృత
వ్రతచూడామణియై దయాశరధియై వర్ధిల్లి యత్యున్నత
స్థితిఁగూర్పం దలపోసె భారతసవిత్రీదేవి కత్యంతముఁ. 67

క. పావనహృదయుం డాతఁడు
జీవితకాలమ్ము సర్వజీవులకు మహా
సేవలు చేయుచు మోక్ష
శ్రీవాసముఁ జేరె శాంతి చేకుఱ నన్నా! 68

వ. అటు పిదప 69

బుద్ధుని జననము

గీ. పరిఢవిల్లు హిమాచల ప్రాంతమందు
గపిలవస్తుపురంబు సౌఖ్యప్రదంబు
అచట దాయాదులను గూడి యవని నేలు
నృపతి శుద్ధోధనుండు శాంతప్రియుండు. 70

ఉ. ఆ మనుజాధినేతకుఁ ద దర్థశరీరముగా వెలుఁగు మా
యామహిళాలలామకు దయామధుపూరితభావధామకున్
నోములపంటయై బుధమనోహరరూపకళానిశాంతమై
కోమలమూర్తియై ముద్దుగొల్పు కుమారుఁడు కల్గె వెల్గుచున్.

ఉ. సార్థకనామమంచు బుధసంఘము దీవనలిచ్చుచుండ సి
ద్ధార్థుఁడు నా లిఖించె మధురాక్షరముల్ ధరణీశుఁ డా దయా
వార్ధియ నాఁటి బుద్ధభగవానుఁడు లోకమునం బరోపకా
రార్థమిదంశరీర మనునట్టి నుడిన్ వివరించెఁ బ్రేముడిన్. 72

ఉ. ఆ యమలస్వరూపుఁడు దయామయచిత్తుఁడు నాఁడు బాల్యపుం
బ్రాయమునంద జ్ఞానము నపారముగా గడియించి యౌవన
ప్రాయమునన్ యశోధరకుఁ బ్రాణవిభుండయి పుత్త్రుఁగాంచి తా
నాయన కండయై మహీజనంబుల నేలె యువప్రభుం డనన్. 73

చ. అఱమరలేనిడెందము నఖాదిశిఖాంతము లీనమై వయః
పరిమితినందు నందము నపారకృపారసధారలూరు సుం
దరవదనారవిందము ముదంబిడఁగా సకలప్రజాళి కా
సురుచిరమూర్తి పట్టణముఁజూడఁ బ్రయాణముచేసె నర్మిలిన్. 74

వ. తన సంరక్షణార్థంబు తండ్రి నియమించిన వృద్ధసేవకుండును ననుభవ
శాలియు నగు చెన్నుఁ డనువానివెంటఁగొని వీధినరుగుచుండ 75

సిద్ధార్థుఁడు - భయంకర దృశ్యములు

సీ. చెవిసోఁకె నొకచోటఁ జిఱుపాప నెడబాసి
యలమటించెడి పేదరాలి ఘోష
కన్పించె నొకచోటఁ గటికవానికిఁ జిక్కి
కన్నీట నల్లాడు గంగగోవు

ఎదురయ్యె నొకచోట హీనాంగములతోడఁ
బస్తులుండి తపించు బక్కవాఁడు
చూపట్టె నొకచోటఁ బాపాకరంబైన
కులమతావేశసంకులరణంబు

గీ. కనుపడిరి యొక్కచోట భాగములకొఱకుఁ
దలలు బగులఁగఁబోరాడఁ దారసిలెడి
యన్నదమ్ములు నొకతల్లికన్నవారు
జాలిగుండెల యువరాజచంద్రమునకు. 76

క. నవనవకోమలహృదయుఁడు
యువరాజప్రవరుఁ డెన్నియో విషయము ల
ట్లవలోకించుచుఁ జెన్నుఁడు
విహరించుచునుండ వినుచు వీధులఁ దిరిగెన్. 77

గీ. ఆదరువులేని యొకనిఱుపేదవాఁడు
చేరి నివసించుచున్నాఁడు చెట్టునీడ
నాలు చూలాలు ప్రసవించు నట్టివేళ
నతని తహతహ సిద్ధార్థు నడలఁజేసె. 78

గీ. పాలపాపని నెడబిడ్డ పజ్జఁజేర్చి
కూలికేగెడి లేఁతయిల్లాలి జాలి
చూపు యువరాజు హృదయమ్ము నూఁపియూఁపి
తాపమునముంచెఁ బ్రేవులఁ దఱిగివైచె. 79

సిద్ధార్థుని మనోవేదన

క. కరము జగంబెల్ల భయం
కరముగఁ గన్పించె నతని కనులకుఁ గరుణా
కరము హృదంతరమగుటన్
బరితాపముఁజెందె యువనృపాలుఁడు జాలిన్. 80

వ. అట్లు జాలివడి యం దుండజాలక 81

ఉ. కన్నుల నీరుక్రమ్మఁగ నెగాదిగ లోకముఁజూచి చిన్నగాఁ
జెన్నునిఁ జేరఁబిల్చి యిలు చేరుదమా యని హెచ్చరించి యా
యన్న విషాదవహ్నులకు నాహుతియైన మనోంబుజంబుతోఁ
దిన్నఁగఁ బోవసాగె నలుదిక్కులఁ గాంచుచు భీతిచేకుఱన్. 82

ఉ. చేరె గృహంబు దేనిఁ బరిశీలన చేయఁడు ముద్దుబిడ్డనిన్
జీరఁడు ధర్మపత్ని సరసీరుహలోచన నయ్యశోధరం
గోరఁడు మాట లాడఁడు డిగుల్పడి నట్టులఁ జూచుచుండు నా
హారము నారగింపఁడు కటా! సుకుమారశరీరుఁ డక్కటా! 83

వ. కడుంగడు దీనహృదయుండై యేమియుఁ దోఁపక తన మనంబున

క. నానావిధబాధలతో
నానందరహితశూన్యులై ప్రజ లిటులన్
గానంబడుచుండిరి యీ
దీనుల రక్షించు టెట్లు తెలియకయుండెన్. 85

క. చింతాస్వాంతమ్ములతోఁ
బంతమ్ములతో విభేదభావమ్ములతో
వంతంబడుమానవులకు
శాంతిపదార్థమ్ము నెటు లొసంగెద నకటా! 86

క. ఈ దైన్యస్థితి నాపుట
కేదైనఁ బథంబు దొరకునే? దొరకినచోఁ
నే దిక్కున వెదకఁగనగు
లేదుగదా సౌఖ్య మిట్టులే యుండినచో 87

## సిద్ధార్థుని సర్వసంగపరిత్యాగము

వ. అని యోజించుచు నెట్టకేలకు మానవప్రపంచశాంతిసాధనంబగు
సత్యమార్గంబు నన్వేషించుట ముఖ్యమగుధర్మంబనితలంచి యు
య్యర్ధరాత్రసమయమ్మున 88

చ. లలితకళావిశాల శుభలక్షణజాల పవిత్రశీల ని
ర్మలహృదయాలవాల యసమానదయాగుణలోల యావనో
జ్జ్వల నిజధర్మపత్ని తలవాల్చి సుషుప్తినిగాంచువేళ నా
విలసితమూర్తి లేచి యిలువీడఁదలంచెఁ బ్రజావనార్థమై. 89

క. మూఁటి వర్జించి యాఱిటి గోటమీఁటి
యేడిటి నణంచి విడనాడియెనిమిదింటిఁ
బయన మైనాఁడు శాంతిసంపద గ్రహింపఁ
బాప మెఱుఁగని చిన్నారిబాటసారి. 90

ఉ. అంతకుముంద యవ్విషయమంత యెఱింగి యెఱుంగనట్లుగా
జెంతఁబరుండి నిద్దురనుజెందక రాజకుమారమౌళి న
త్యంతదయం గనుంగొనుచు నాత్రమునందెడి చెన్నుఁడెంతయో
చింతవహించి వెంటఁజనె చిన్నగ నోరుమెదల్పఁబోవకే. 91

క. వెనువెంట మెల్లమెల్లఁగఁ
జని చెన్నుఁడు మనసునిలుపఁజాలక సిద్ధా
ర్థుని బలుకరించి యిట్లనె
వినయంబు భయంబు భక్తి వెలువడ నోర్మిన్. 92

## చెన్నుఁడు సిద్ధార్థుని వేఁడుకొనుట

ఉ. ఈ యమితాంధకారమున నేరికిఁజెప్పక మమ్ము నమ్మ న
బ్బాయినివీడి సర్వమునుబాసి ప్రపంచము రోసినట్లు బా
బూ! యెటకిట్టు లొంటరిగఁ బోవుచునుంటివి ? తేరుసిద్ధమున్
జేయుదునా ? యటంచు నృపశేఖరుఁజూచి నమస్కరించుచున్ .

ఉ. సేవకు లెవ్వరైన నిరసించి యెఱుంగరె ? పౌరులందఱున్
దేవర వచ్చు నిన్ను వినుతించెదరే ? యెదురాడరే మహా
దేవి రవంతలోటుకలదే! సకలంబునువీడి త్యాగివై
పోవఁదలంచితేటికిఁ బ్రభూ! వివరింపుము నీకు మ్రొక్కెదన్. 94

చ. అడుగులఁబట్టి మ్రొక్కెదదొరా! యిది ధర్మముకాదు గుండియల్
దడదడలాడెఁ గన్నతలిదండ్రులువృద్ధులు రేపుచూచి నా
కొడుకెటకేగెనోయనుచుఁ గొందలమందుచు నిండుప్రాణముల్
విడిచెదరంచునీవెఱుఁగవే ? దొరసాని భరించి నిల్చునే. 95

చ. అసలు విరాగమేటికి మహాశయ ! మొన్నటి బిడ్డవీవు వె
క్కసమయిపోయెనే యిహసుఖంబపుడే ? నవయౌవనప్రభల్
మిసమిసలాడుచున్నవిసుమీ ! మగబిడ్డఁడుపుట్టె నింక నీ
రసపడిపోవు టేటికి మరల్పుము నీ హృదయప్రయాణమున్.

ఉ. మొన్నటినుండి మారినదిమోము దొరా! భయమిచ్చుదృశ్యముల్
కన్నులఁజూచుటన్ భయముకల్గినదో మఱియేమొ ? కాని నీ
వన్నముమాని చేయఁగలవా సవరింపులు వారిబుద్ధుల
ట్లున్నవి పట్టిమార్చుటకు నొక్కఁడొ! యిద్దరొ ? పాఱఁజూడుమా.

వ. అని వెండియు నిట్లనియె! 98

ఉ. ఏ పని కూడదంచు మది నెంచెదవో యదిచెప్పు మిప్పుడే
నాఁపెద బ్రహ్మదేవుఁ డెదురైనఁ జలింపక నా ప్రతాపమున్
జూపెద నిన్ను గాదని వసుంధర నెవ్వఁడు నిల్వనోపు నీ
పావముసేయఁబూనకుము బాబు ! దయామతి వీవు కావునన్.

క. అని బ్రతిమాలెడు చెన్నుని
గనుఁగొని చిఱునవ్వులలరఁ గర మెత్తి భుజం
బునవైచి పలికె గౌతముఁ
డనుఁగుంజెలికాఁడు భీతినందుచు వినఁగన్. 100

## సిద్ధార్థుఁడు చెన్నునికి బోధించుట

ఉ. నాకొక భూతమోయనఁ గనంబడుచున్నది చూడఁజూడ నీ
లోకము చెన్న! దీని నవలోకనచేసి మదంతరాత్మ చీ
కాకువహించె శాంతికొఱకై ప్రయతించెద వెంటనంటిరాఁ
బోకుము చింతఁ జెందకుము పొమ్ము గృహమ్మును జేరసమ్మతిన్.

చ. కదలుచునుండె మానసము గాలిపటంబునుబోలి భావముల్
చెదరితపించుచున్నయవి చిందరవందరలై ప్రపంచమే
హృదయములేనిదయ్యె భరియించుట కష్టము దీననిల్చి నన్
వదలుము శాంతిదూతనయివచ్చెదఁ బ్రాణమునిల్చియుండినన్.

ఉ. తక్కువలేవు నాకు ధనధాన్యనిధుల్ నిజధర్మపత్నియా
మక్కువ వీడలే దొక కుమారుఁడు కల్గె నమాత్యవర్గమా
నిక్కచరింపలేదు గమనించితిఁ దద్దశలెల్లనైన నా
కొక్కనికుంటచాలదు సహోదరులెందఱొ లేమిడింబడన్.

ఉ. ఈ యధికారముల్ గృహము లీ నవరత్నసువర్ణసంపదల్
నాయవి యంచుఁ బల్కఁదగునా! తొలి మొదలు రాజులేలిరో
యీ యవనీతలంబు నిఁక నెందఱుభూపతులేలనుండిరో
పోయెడివారు పోయెదరు పుట్టినవారు గ్రహింతు రన్నిటిన్. 104

ఉ. మాయలు మర్మముల్ దురభిమానము లామయముల్ పరస్పరా
సూయ లకాలమృత్యువులు శోకము లీర్ష్యలు వంచనంబు ల
న్యాయము లాక్రమించెను బ్రజావళి మంచికిదావులేదు చె
న్నా! యిఁకఁ జూడఁజాలను వనంబులకేగి తపమ్మునర్చెదన్.

చ. ఒకనికిఁ దావులేదు మఱియొక్కని కన్నము నిండుసున్న వే
ఱొకనికి వస్త్రహీనత మఱొక్కని కామయబాధ సర్వమున్
బ్రకటితమయ్యె రాజు లవిపాపక కర్మమునంటఁగట్టుచో
నిఁక మన రాజ్యపాలన మదేటికిఁ జేయునకా! హితాగ్రణీ. 103

వ. మఱియు నా నిశ్చితాభిప్రాయంబు వినుము. 107

క. క్షణికంబులు చర్వితచ
ర్వణములు దైహికము లేలవర్ణించెదు ర
క్షణమార్గ మేదియొ నిరీ
క్షణచేసెదఁ జెన్న నీవు జంకకుమన్నా! 108

వ. అని సిద్ధార్థుఁడు చెన్నుని బుత్తెంచి సంన్యసించి యారాద కాలపుఁడను మహాత్మునియొద్దఁ గొంతకాలంబుగడపి శాస్త్రధర్మముల నెఱింగి పిదప రుద్రకుండను మహర్షిచెంతఁ బ్రాణాయామాది సాధనంబులఁ దెలిసికొని తపస్సు చేయక యెయ్యదియులభింపదని తలంచి యాఱుసంవత్సరము లన్నపానాదుల వర్జించి గయారణ్యములఁ దపంబొనరించి మూర్ఛిల్లుటయుఁ జెంతఁగల యతని మిత్రులు వెడలిపోవుటయుజరిగెఁ బిమ్మట నయ్యుదారుఁడు 109

### సిద్ధార్థుఁడు సంన్యసించి మోక్షమార్గ మెఱుఁగుట

గీ. దేశదేశంబులన్నియుఁ దిరిగితిరిగి
చేరి గయయొద్ద నొకరావిచెట్టుక్రింద
ధ్యానమువహించి మోక్షతత్త్వముగ్రహించి
బుద్ధుఁడై మానవులకెల్ల బోధజేసె. 110

గీ. మాయకులమతశాఖాభిమానములకు
మంత్రతంత్రరహస్యసన్మానములకు
సంఘవిద్రోహకరదురాచారములకుఁ
దావులేదన్న! బౌద్ధసిద్ధాంతమందు. 111

గీ. వంచకోపాయములకు దుర్వాదములకుఁ
బాపకృత్యములకుఁ గోపతాపములకు
గలుషసంచారములకు దుష్కామములకు
నెలవుదొరకదుగద బౌద్ధనీతియందు. 112

గీ. శాంతిశమదమ సత్యవిజ్ఞానములకుఁ
బేర్మికిని విశ్వసోదర ప్రేమమునకు
నభ్యుదయమార్గములకు నాహ్లాదములకుఁ
గరుణ కాస్వామిబోధ మందిరమ్ముసుమ్ము. 113

సీ. మొద లహింసామార్గమున సంచరించుట
కరుణాసుధావృష్టి గురియుచుంట
విశ్వసోదరమైత్రి వెలయించుచుండుట
ధర్మచింతనమునన్ దవిలియుంట
పరసంపదలకాసపడక వర్తించుట
సత్యవ్రతంబును సలుపుచుంట
నిలిచి మాయామర్మములఁ జేరనీకుంట
సంతృప్తివిడనాడఁజాలకుంట

గీ. ఘోరదుఃఖమ్ములకు మూలకారణమ్ము
కామమని యెంచి యద్దానిఁ గాంచకుంట
బుద్ధభగవానుఁ డొనరించు బోధయందుఁ
గానఁబడు నాఁడు నేఁడు నిక్కమ్ముచూడు. 114

ఉ. ఆ మధురప్రబోధము నహర్నిశమున్ విని విశ్వసోదర
ప్రేమసుధారసమ్ము బఱపెన్ సచరాచరలోకమెల్ల నా
స్వామిమతప్రభావితతి సర్వదిగంతములందుఁ బ్రాఁకి దీ
ప్తామయమావికాసము నఖండముగాఁబురికొల్పె నెల్లెడన్.

చ. కలవు యువప్రభూ ! భరతఖండమునందుననేక రాజ్యముల్
విలసితరూపసంపదలవిస్తృతిఁ గన్నవికాని వానిలో
సలలితవైభవోన్నతులఁ జాటుచు మేటియనంగఁ గీర్తిఁజె
న్నలరుచునుండె నాఱవశతాబ్దమునన్ మగధోర్వి యెంతయున్.

ఉ. అనుపమశక్తితోఁ దనరు నమ్మగధన్ శిశునాగవంశవ
ర్ధనుఁడగు బిందుసారుఁడు పరాక్రమవిక్రమశక్తియుక్తిఁ బా
లనమొనరించుచుండెఁ బ్రజలన్ గృపఁజూచుచు, రాజ్యకాంక్షచేఁ
దనయుఁ డజాతశత్రుఁ డమితంబగు వైరముఁ బూనియుండఁగన్.

వ. ఒకానొకసమయమ్మునఁ బొంచియుండి యయ్యజాతశత్రుండు తండ్రిని జంపి సింహాసనంబధిష్టించి రాజ్యంబునేలె. మగధరాజ్యంబు నధికంబు గావింపనెంచి యనేకరాజ్యంబులనాక్రమించె వైదేహుల జయించి గంగానది యొడ్డున దిట్టముగనొకకోటఁగట్టించె. 118

క. పారసీకులు గ్రీకులపైకి వెడలి
దండయాత్రలుసాగించు తరుణ మదియ
గ్రీకుసైన్యంబులన్ దాఁకి గెలువలేక
కడకు వారోడిపోయినకాల మదియ. 119

ఉ. నాఁడు మహాబలాఢ్యులగు నందులు తచ్ఛిశునాగసేనపై
దాడినొనర్చి గెల్చి మగధప్రభువున్ గదనప్రదేశమం
దోడఁగఁగొట్టి నెట్టి విజయోత్సవముల్ చెలరేఁగ గద్దియం
గూడిరి ఘోరపాపములకుం దల లొగ్గిరి నిగ్గి రన్నిఁటన్. 120

నందుల పాలనములు

వ. తొల్లిపారసీకులు గ్రీకులపైదాడిసల్పి యోడిపోవుటయుఁ దత్కారణమునఁ బారసీకరాజ్యమును గ్రీకులాక్రమించుకొని తూర్పుదేశములజయించుచు హిందూదేశముపైఁ గనువేయుటయు నాఁటికి శిశునాగవంశస్థులపాలనం బడుగంటుటయు నందరాజ్యంబు విస్తరిల్లుటయు జరిగె. 121

క. ధరనేలె మహానందుఁడు
నరపాలకుఁడగుచు నయ్యనంతరము వసుం
ధరనేలెఁ బద్మనందుఁడు
సురుచిర గుణుఁడతని ప్రథమసుతుఁడై యొంటన్. 122

గీ. ఆ నృపతి పద్మనందుఁ డత్యంతబలుఁడు
మును కళింగాది ఘనదేశముల జయించి
మగధరాజ్యేందిరను సక్రమముగ నేలెఁ
బ్రస్తుతికినెక్కెఁ జతురంగబలములొప్ప. 123

క. తన మరణతరుణమున నం
దనులను నందులనుబిల్చి తనరాజ్యము న
ల్లన పంచియిచ్చి స్వర్గం
బున కేఁగెను బద్మనందభూపతి పిదపన్. 124

క. నందులెనమండ్రు మగధమ
హిం దమశాసనముపఱపి యేచి ప్రజకు ని
బ్బందులఁగూర్చిరి కడపటి
నందునికాలమున గ్రీకునాథుఁడు వెడలెన్. 125

వ. మఱియు నందు లుక్కుమిగిలి శిశునాగవంశీయుల వెదకివేటాడఁ దలంచుటయు నా సడిఁగని యవ్వీరులును వారియనుచరులును గాల మాహాత్మ్యంబునకులొంగి యందందుఁ దలలఁ దాఁచుకొనఁ బ్రయత్నించిరి. బాలవీరుండును దద్వంశజుండు నగు చంద్రగుప్తుఁడు. 126

క. సమయమ్ముఁజూచి వైరుల
సమయించుటమేలటంచుఁ జని యొకచో గూ
ఢముగఁజరించుచు బహుసై
న్యములంబరికించి కూర్పసాగెనుదీక్షన్. 127

అలగ్జాండరు దండయాత్ర

ఉ. గండరగండఁడై భరతఖండముపైఁ గనువేసి చండమా
ర్తాండసమానతేజుఁడు పరాక్రమభీముఁడు గ్రీకురా జల
గ్జాండరు నిండుసైన్యమును గైకొని సింధువుఁజేరినిల్చె బ్ర
హ్మాండము దద్దరిల్లఁ జతురంగబలంబులతో మహోద్ధతిన్. 128

వ. దాడివెడలునప్పుడు తనసైన్యంబును రెండుగఁజేసి యం దధిక భాగ
మును కైబరుకనుమనుండిపంపి స్వల్పభాగముతోఁ దాను చిత్రాలు
దారినివచ్చి సైన్యంబునుగలిసికొని భారతదేశంబునఁ బ్రవేశిం
చుటయు 129

చ. ఉరవడి వైరియైన పురుషోత్తమభూపతిఁజంప నియ్యదే
తరుణమటంచు నంభియను తక్షశిలానగరాధిపుండు త
త్పరధరణీతలేశ్వరునిపక్షముఁజేరి స్వకీయవాహినిన్
దురమునకంపె గెల్చెడి విధుల్ వివరించుచు మందబుద్ధియై. 130

వ. అయ్యుదంతంబు వెల్వడుటయు 131

చ. పరులకుమర్మమిచ్చి తనపై కుటికింపఁదలంచె నంభి యం
చురతరశౌర్యమూని పురుషోత్తమభూపతి సైన్యయుక్తుఁడై
శరములఁదాల్చి సమ్మదగజంబుపయిన్ రణభూమిదూఁకి భూ
వరుఁడను నేన రండని సవాలొనరించె గభీరవాక్కులన్. 132

ఉ. భండనభూమిపైఁదిరుగు భారతవీరుల గ్రీసురాజల
గ్జాండరుచూచి గుండియలుజాఱ రణంబు పణంబు వీడి తాఁ
గొండొక మాయఁబన్ని రిపుకోటినణంచుట మంచిదంచు లే
లెండని జంకినట్లు కదలించె దళంబులఁ దన్నదీతటిన్. 133

అలెగ్జాండరు పురుషోత్తముల యుద్ధము

ఆ. అర్ధరాత్రసమయమందు వేఱొకచోట
నది నతిక్రమించి కదిసివెనుక
సమరరంగమందు సైన్యంబుఁజొప్పించె
ధర్మయుద్ధమందుఁ దాఁకలేక. 134

క. అరు లఱ్ఱువంచి రిఁక సం
గరమేలయటంచు సైనికగ్రామణు లే
మరుపాటున నుండిరి త
త్తరుణంబున రాత్రివేళ దాఁకిరి గ్రీకుల్. 135

క. ఉరుశస్త్రాస్త్రగదాము
ద్గరచక్రమహాత్రిశూలకరవాలముఖో
ద్ధురసాధనకదనపరం
పరలన్ తెగఁబోరి రుభయపక్షాధిపతుల్. 136

ఉ. సంగరరంగమం దుభయసైన్యము లద్భుతశౌర్యధైర్యముల్
పొంగ మహాయుధమ్ములను బూని దృఢాంగతురంగసంగతో
త్తుంగశతాంగసంఘములతోఁ జతురంగబలంబు లొప్పఁ బో
రం గమియించె నుజ్జ్వలపరాక్రమవిక్రమశక్తు లొప్పఁగన్. 137

వ. మాతృదేశాభిమానులును మహావీరులు నగుపురుషోత్తమభూపతి
సైనికులు మిడుతల దండువలె గ్రమ్మిన గ్రీకు సైన్యంబును బటాపం
చలుచేయుటయు నాఁటి రెండవ యుద్ధంబున. 138

గీ. అంభి సైన్యము గ్రీకు సైన్యంబు కలిసి
సమరరంగంబునన్ జేరుజాడ నెఱిఁగి
మదగజము నెక్కి పురుషోత్తమప్రభుండు
బవరమున దూఁకె శత్రుభూపతిని దాఁకె. 139

క. నదిదాపున నిర్వ్వరకున్
గదనం బదనముగ జరుగు కాలంబుననే
బెదరి పురుషోత్తమప్రభు
మదగజ మకటకట! వక్రమార్గముఁ బట్టెన్. 140

క. బెదరద రెఱుఁగని భూపతి
మదగజ మట్లైపుడు భీతి మరలెనో? యవుడే
యద నిద యని రిపుసైన్యం
బుదధియనం బొంగి పూరుషోత్తముఁ జుట్టెన్. 141

ఉ. క్రమ్మినగ్రీకుసైన్య మధికమ్మగుటం గమకించి సింహానా
దమ్మొనరించి జంకినమదద్విరదంబును డిగ్గి శౌర్యమున్
జిమ్ముచుఁ బోరుసల్పె నృపశేఖరుఁడా పురుషోత్తముండు యు
ద్ధమ్మున వెన్నుఁ జూపరుగదా? రిపుకోటికి వీరశేఖరుల్. 142

చ. కదనకళాధురంధరుఁ డఖండబలుండగుఁగాక విక్రమా
స్పదుఁ డగుఁగాక సాహసమపారముకల్గినఁగల్గుఁగాక యెం
త దనుకఁబోరు నొక్కఁడు పదాతిదళంబులు దిక్కుదిక్కునన్
జెదరెను బూరుషోత్తముఁడు చిక్కె విరోధులకాహవమ్మునన్.

వ. అట్లు పట్టువడిన పురుషోత్తముని తెలంగెటింగి యలగ్జాండరు విజయ
లక్ష్మినిగంటినని గంతు లిడసాగె. 144

పురుషోత్తముని యపజయ కారణములు

సీ. అభిమానధనశూన్యుఁడై తక్షశిలరాజు
పగవారిపాదముల్ పట్టఁడేని
రణధర్మరహితుఁడై రా జలగ్జాండరు
నమ్మించివెనువైపుగ్రమ్మఁడేని
సమరమ్ముతీవ్రమై సాగుచుండినవేళ
మదగజరాజంబు బెదరదేని
లావెల్లవిడిచి జీలమునదీపూరంబు
రెండవమార్గ మీకుండెనేని

ఆ. విజయలక్ష్మి యెవరివెన్నంటివచ్చునో
యెవరియంకపీఠమెక్కి నిలిచి
కులుకుచుండఁగలదో తెలియకపోవునే ?
కనులమూసి గంతగట్టఁగలరె ? 145

క. రణమునఁ బట్టువడిన కా
రణమున భూపతి నిరాదరణమున్ గనెనే ?
యణుమాత్రమైనజంకక
ప్రణుతింపంబడియె గ్రీకుపతితో వినుమా ! 146

వ. తనసైన్యాధిపతులచే బంధితుఁడై కొనిరాఁబడిన పురుషోత్తముని
జూచి యలెగ్జాండరు. 147

క. నీవిపుడు చిక్కితివి ని
న్నేవిధముగఁ జూడవలయు నెఱిఁగించెదవా!
నావిని యా పురుషోత్తమ
భూవరుఁ డనె శౌర్యరసము పొంగులువాఱన్. 148

చ. నిజముగ నీవు గెల్చితివొ ? నేను జయించితినో ? కళానిధుల్
సుజనులు వీరశేఖరులు సూనృతవాదులు నిర్ణయింతు ర
క్కజమగుదీక్షతో యుగయుగంబులనిల్చుచరిత్రయందు నీ
భుజబల మీ యకృత్యములఁ బొందునెకీర్తి హసింపరే ? బుధుల్. 150

వ. ఎట్లంటివేని

మ. చలనంబందని వీరశేఖరుఁడు దీక్షాకంకణంబూని యు
జ్జ్వలతేజంబుననిల్చిశత్రుపతినాహ్వానించునిక్కంబు మా
యలతోఁ జాటుగవచ్చిపట్టునొకొ ? హర్యక్షంబు కుంభస్థలం
బులపై దూఁకునుగాని వాలములవైపుంజూడవాంఛించునే ? 151

క. పగనైనఁ జెలిమినైనం
దగుధర్మములుండు వానిఁదలఁపక యెపుడున్
దెగఁబడి తిరుగరు వీరులు
సుగుణప్రియమైనబుద్ధి చొప్పడునేనిన్. 152

వ. సమయ సన్నాహంబులకుఁ దావీయని యుద్ధంబుల లభించు జయంబు లపజయంబులు సమానము లని రణధర్మములు వలుకు చుండు 153

క. అడిగినప్రశ్నకు నుత్తర
మిడకుండుటతగదువసుధనేరికి నను నీ
వడిగితివికాన నుత్తర
మిడుచుంటిని దాని వడిగ్రహించినఁజాలున్. 154

క. నీ తోడిరాజులందఱు
నేతీరుగఁజూడఁదగునో యెఱుఁగుదువుకదా ?
యాతీరుఁజెప్పవలెనా ?
భూతలములనేలునీకు బుధులుహసింపన్. 155

అలెగ్జాండరు సిగ్గుచేఁ బురుషోత్తము సన్మానించుట

క. ఆపగిదిం బురుషోత్తమ
భూపతి వచియింప సిగ్గుఁబొంది యిదిమహా
పాపమనితలఁచి పశ్చా
త్తాపముతో శత్రురాజు తహతహపడియెన్. 156

ఉ. అ ద్ధరణీతలాధిపతి యాహవనీతిఁ గళావిభూతి శౌ
ర్యోద్ధతి ధర్మపద్ధతి మహోజ్జ్వలశక్తి సుధామధూక్తి నా
యుద్ధమునందుఁజూచి సమయోధుఁడితండని వాని చెల్మికే
సిద్ధపడెన్ విరోధినృపసింహుఁడు యుద్ధమునందుగెల్చియున్. 157

వ. ఆసమయమున మగధరాజ్యంబునేలు మహాపద్మనందుఁడు శిశునాఁగవంశస్థుల వధించిన కారణంబునఁ దద్వంశీయుఁడగు చంద్రగుప్తుండు దేశమువిడిచి యజ్ఞాతవాస మనుభవించుచుండి యొక్కనా డలగ్జాండరును గలిసికొని నందులదుండగంబుల వివరించి ప్రజలబాధలఁదెలిపి దండయాత్రకుఁ బురికొల్పుటయు నాతఁ డంగీకరింపక వెడలుటయు జరిగెఁ బిమ్మట నా చంద్రగుప్తుఁడును బ్రజలు నేకమై చాణుక్యుడనులౌకికకళాధురంధరునిసాయమున సైన్యము నేర్పఱుచుకొని నందుల నుక్కడంచి మగధరాజ్యంబు నాక్రమించుకొని.

చంద్రగుప్త చక్రవర్తిపాలన

ఉ. పాలనచేసె దీక్షఁగొని భారతధారణిఁ జంద్రగుప్తభూ
పాలుఁడు ధర్మశీలుఁడు కృపాలుఁడు ధీరుఁడు నిత్యసత్యవా
గ్జాలుఁడు శాంతిలోలుఁడు విశాలయశశ్శరదిందుచంద్రికా
జాలుఁడు పారమార్థికవిచారసమగ్రుఁడు ప్రేమమూర్తియై. 159

వ. ఆ మ్మహీపతి మురయనుసాధ్వీమణి కుద్భవించుటంజేసి మౌర్యుఁ డనునామంబువహించి పరరాజులదాడివలన ముక్కలుముక్కలై యున్నభారతభాగంబుల నేకమ్మొనర్పఁదలంచిసెల్యూకసునోడించి యాతనిపుత్రికం బెండ్లియాడి సుఖంబుండె. 160

గీ. అతనిదరినుండి చాణుక్యుఁడనెడి మంత్రి
యర్థశాస్త్రమ్మును రచించె నద్భుతముగ
విష్ణుగుప్తుం డటంచు నా విబుధవరుని
నామమును వివరింతు రానాఁటి ప్రజలు. 161

గీ. నాఁటి పరిపాలనావిధానముల సంఘ
గతుల వివరింపఁగల "యిండిక"ను రచించి
గణుతికెక్కినఘనుఁడు మెగస్తనీసు
రాజు సంస్థానమునగ్రీకు రాయబారి. 162

క. హితచరితుల నల్వుర స్వ
ప్రతినిధులనునిల్పి రాజ్యభాగంబుల ను
న్నతదశకుఁదెచ్చె నా భూ
పతి గ్రామంబులను నిల్పెఁ 'బంచాయతులన్' 163

గీ. ఆ నరేంద్రుడు తనరాజధానియైన
పాటలీపుత్రమున కొక్కకోటఁగట్టె
బ్రతిదినంబును ముత్యాలపల్లకీల
హాయిగా నల్పుచుండు విహారములను. 164

గీ. ఏలికొనెఁ బశ్చిమాశఁ గాబూలువఱకుఁ
గాందహారమునుండి బెంగాలువఱకు
సారహిమగిరినుండి మైసూరువఱకుఁ
జంద్రగుప్తావనీశుండు సాంద్రయశుఁడు. 165

గీ. అ మ్మహారాజపరిపాలనమ్మునందుఁ
బ్రజలకేమాత్రమును లోటుపాటులేదు
ఋణపణాదుల సత్యవీక్షణముతప్పఁ
బత్రములుసాక్ష్యములు నిల్పఁబడవుసుమ్ము. 166

గీ. ఉచితభోజనవసతు లెన్నోసృజించి
యంగవైకల్యబాధల ననుభవించు
ప్రజలఁ బాలించుచుండుఁ గృపామయుండు
పావనుఁడు చంద్రగుప్తభూపాలవరుఁడు. 167

వ. పాటలీపుత్రమున నఱువదిద్వారములుగల ప్రాకారమును నిర్మించి యగాధమైన యగడ్తనుబాదుకొల్పి ముప్పదిమంది మహామేధావులతో నొకపరిషత్తునుస్థాపించి యొక్కొక్క శాఖ నైదుగురు చూచునట్లునియమించె. మఱియు 168

ఉ. చారుతరంబు హేమవిలసన్నవరత్నవికీలితోన్నవ
ద్వారవిరాజితమ్ము మయవాస్తుకళాకలిత మ్మపారశృం
గారసమన్వితమ్ము సుముఖప్రకటీకృతదారుకల్పనా
గారము నిల్పఁజేసె నవఖండము లచ్చెరువంద నర్మిలిన్. 169

గీ. రథ గజాశ్వపదాతిధారాళసైన్య
రాశితోనిల్పి చక్కఁగ రాజ్యమేలి
యంత్యదశ జైనధర్మంబు ననుకరించి
యసువు శ్రావణబెల్గోలయందుఁబాసె. 170

ఉ. నందులనెట్టి గ్రీకులరణంబునఁబాఱఁగఁగొట్టి మౌర్యరా
జ్యేందిరదిట్టఁజేసి హృదయేప్సితముల్ సమకూర్చుచున్ బ్రజా
నందముఁ గూర్చినట్టి నరనాథశిరోమణిచంద్రగుప్తుఁ డ
ట్లందఱివీడి స్వర్గసుఖమందిన వెంటనె పౌరులొప్పఁగన్. 171

వ. చంద్రగుప్తభూపాలునినందనుండగు బిందుసారుండు సింహాపీఠి నలంకరించిరాజ్యంబు నేలిప్రజారంజకుండయ్యెఁ బిదప నాతనికుమారుం డశోకవర్ధనుండుగద్దియంగొని ప్రజాపరిపాలనంబు సేయుచు సామ్రాజ్యంబు నభివృద్ధిసేయ సమకట్టె. 172

అశోకుఁడు కళింగవీరులఁజంపి పశ్చాత్తాపముఁజెందుట

సీ. అతఁడు కళింగరాజ్యరమనంద మనంబున నూహచేసి య
ప్రతిహతసైన్యసంపద నపారముగాఁ గదలించి తన్మహీ
పతులను బంధుమిత్రపరివారసమేతముగా రణంబునన్
హత మొనరించివైచె రుధిరాపగలెల్లెడపాఱుచుండఁగన్. 173

క. తదనంతరమ్ము భూపతి
కదనస్థలమును బరీక్షగావించి కడున్
హృదయావేదన నందుచుఁ
గదలిన యశ్రూదకమ్ము కన్నులరాలన్. 174

వ. పశ్చాత్తాప మందుచు దనమనంబున నిట్లువగవందొడంగె 175

ఉ. ఈ రణరంగమందుఁ బ్రవహించెడి రక్తనదుల్ మదీయ దు
ర్వారదురాశయందుఁ బ్రభవంబయినట్టివి దేశభక్తులీ
వీరులు నన్నుఁగాంచిన సవిత్రినిబోలు సతీమతల్లులిం
పారఁగఁ గన్నవారలకదా ? తలపోసిన గుండెబ్రద్దలౌ. 176

ఉ. ఏ యపరాధముల్ సలిపి రీ ఘనకాయులునాకు వీరి నే
నాయముతో వధించితి జనంబుసహించునె ? రాజ్యభోగముల్
పాయనివే ? పురాధరణిపాలురు చచ్చిననాఁడువెంటఁగొం
పోయిరెపీసమైన జలబుద్బుదముల్గద యీ శరీరముల్. 177

ఆ. ఎన్నికన్నకడుపు లీవార్తలాలించి
పగిలిబ్రద్దలగునొ వగలసెగల
నెన్నిసేర్లు నల్ల లింక ముందు గంగలో
గలియఁగలవొ కంఠములను బాసి. 178

ఉ. ఎచ్చట జూచినన్ శవములే? వికలాంగములే? భుజింపఁగా
వచ్చిన కాకఘూకపరివారములే! పగఁదాల్చి వేసవేల్
పచ్చని కాఁపురంబులను బాడొనరించితి జీవితాంత మీ
మచ్చతొలంగునే? బ్రతికి మాత్రము నేను సుఖింప నేర్తునే!

ఉ. ఏ నిపుడేలఁబోవునది యేదొస్ఫురింపదొకింత యక్కటా
మానవరాజ్యమా! మసనమా! యధిరోహణ మాచరింప ను
న్నా నదియేది పీఠమగునా! భవకూటమ! యాలకింప ను
న్నా నదియేది నా విజయనాదమ? రోదనమా? నిజమ్ముగన్.

వ. అనిమనంబునం బరితపించుచు 181

క. తన మనమంతయుఁ గడుయా
తనసెందుచునుండ దేబెతనమూనుచుఁ బ్రా
ణనిచయమల్లాడఁగ మం
తనమునకుఁ బయానమయ్యె ధరణిపుఁడన్నా! 182

అశోకునకు వృద్ధమాత యెదురుపడుట

చ. వికలమనస్కుఁడై కదలి వీటికిఁబోయెడి త ద్ధరాధినా
యకునకు మార్గమందు నెదురయ్యె నొకానొకవృద్ధమాత య
య్యకలుష యంధురాలు పథమాకనిపింపక భావమా వికా
వికలయి విహ్వాలింపఁ బలవించుచుఁగంఠమునెత్తి యిట్లనున్. 183

క. ఈ వెవ్వరవన్నా! యు
ద్ధావని కీత్రోవ పోవునా! యిఁక నెన్నా
ళ్ళీవిధి సమరంబగు నా
భూవరుఁడెపుడైన శాంతిఁబొందునె చెపుమా! 184

ఉ. మార సమానరూపు లసమానపరాక్రమదీపు లంచితో
దారులు నాకుమారులుఁ దదాహవరంగమునందుఁ బాలుగొ
న్నారలు ఘోరవార్తలు వినంబడుచున్నవి నిన్ననేఁడు రా
త్రైరి తపించుచుంటిఁ గడుపారఁగగాంచిఃదాననాటచే. 185

ఉ. మీా రటకేగి వచ్చుచుంటిరయేని　　　186

క. అన్నా! యెఱుఁగుదువా! నన్
గన్నయ్యల నిన్నమొన్నఁ గదనంబునఁ బా
ల్గొన్నారట సేమంబుగ
నున్నారా! నీవు చూచియుండినఁ జెపుమా!　　　187

వ. అనుటయు　　　188

క. పలికిన పలుకులు చెవులకు
ములుకులవలెసోఁక తెల్లమొగమునఁ గన్నీ
రొలుకఁగ గడగడలాడుచుఁ
బలికె నశోకప్రభుండు పజ్జకుఁజనుచున్.　　　189

ఉ. ఊహాలకందఁజాలని సమున్నతతృష్ణవహించిలేచి దు
స్సాహసమున్ధరించి బహుసైన్యముతో నిటకేఁగుదెంచి నేఁ
డాహవమందు నీ సుతుల నాహుతిగొన్న దురాత్ముఁ డా ప్రజా
ద్రోహియితండె? యీాతనువుతో నిఁక నెన్నిదినంబులుండునో?

వ. అని వచించుటయు వెన్వెంటన యవ్వృద్ధమాత గుండెబాదుకొనుచు
రోదన మొనర్చుచు మూర్ఛిల్లి లేచి యేడ్చుచు　　　191

ఉ. ఇంతటనైనఁ దృప్తినివహించితివా! కరవాలధార వి
శ్రాంతినిగోరెనా? మదివిచారముఁబాసినదా? రవంత నీ
పంతము తీఱెనా? రుధిరపానము దాహము నార్పెనా? యశః
కాంతవరించెనా? యిఁక సుఖంబుగ జీవితయాత్రసాగునా?　　　192

ఉ. పుట్టినదాదిబిడ్డలను పువ్వులతో జతచేసిపెంచి నీ
పొట్టనుబెట్టి నీరిడితిఁ బొమ్మిఁకదుష్టుఁడ? దిక్కులేని యీా
కట్టె తపించి నీ కరుణఁ గాటికిఁజేరును జేపొ మాపొ? నీ
పట్టినపట్టుచెల్లె బహుభాగ్యములన్ దులతూగుచుండుమా!　　　193

మ. సుకుమారుల్ తమమాతృభూమికొఱకై శుద్ధాంతకాంతాజన
ప్రకరంబున్ విడనాడి యుద్ధధరణిన్ బ్రాణంబులన్ బాసి ర
య్యకలంకాత్ములు స్వర్గమందెదరు మాయానాటకోన్మాదివై
యిఁక నీనెత్తినిగొట్టుకొమ్ము ఖలుఁడా! యీరాజ్యసర్వస్వము

క. మారణరణహేలామముతోఁ
గోరికకొండెక్కి ముదముఁగొంటి విఁకన్ బం
గారమునుమాత్రమే యా
హారముగాఁగొనుమ! యితర మంటక మనుమా!

ఉ. ఈవు నిశాచరుండవని యీ సచరాచరలోకమెల్లఁ దా
భావనచేసికొన్నది కృపారహితంబయి వృద్ధిఁబొందు నీ
జీవితమున్ గనుఁగొని హసించుచునున్నదిరా! వసుంధరా
దేవి? సుఖంబు నీకుఁగలదే? జయమియ్యదియా! దురాత్మఁ

క. కొడుకులుపోయిరి యిఁకనీ
పుడమిన్ మనఁజాలనంచుఁ బొగులుచు మూర్ఛం
బడి యా ముదుసలిప్రాణము
విడిచె నశోకుండు వెట్టివెట్టిగఁజూడన్.

వ. తన యకృత్యంబులకు వగచుచు ముదుసలి ప్రాణంబులవీడుటఁజ
భయమందుచుఁ బ్రపంచమురోసి చను నయ్యశోకచక్రవ
మధ్యేమార్గమ్మున

అశోకునకు బౌద్ధభిక్షు వగుపడుట

క. అరమోడ్పుఁగన్నుఁగవతోఁ
జొరవం గలిగించు జాలిచూపులతో బం
గరుచాయమేనితో నొక
కరుణామయమూర్తి యెదురుగాఁ జనుదెంచెన్.

వ. అట్లువచ్చుటయు.

చ. అతఁ డుపగుప్తనామకుఁ డటంచునెఱింగి యశోకధారణీ
పతి పతితాత్మతోఁ గదలి పాదములంబడి స్వీయఘోర జీ
వితకథ యంతయున్ దెలిపి వేఁడుచు నో మహనీయ! నా ;
స్థితికొకదారిఁ జూపుఁ డిదె శిష్యుఁడనయ్యెద ముక్తి నందెదన్

క. అనవిని చిఱునవ్వులతోఁ
దనయా లేలెమ్ము గతముదలఁపకు మది యా
తనవిషము జ్ఞానధనమున్
గొనుమని యాబౌద్ధభిక్షుకుం డిటులాడెన్.

అశోకునకు బౌద్ధభిక్షువు బోధించుట

ఉ. నాలుగువేదముల్ చదివినన్ సకలాగమముల్ పఠించినన్
వేలుగడించినన్ బరుసవేదినెఱింగిన నివ్వసుంధరా
పాలనమందినన్ జపతపంబులు పెక్కులొనర్చినన్ దయా
శీలములేని మానవుఁడు చెల్లఁడు పుత్త్రక ! చిల్లిగవ్వకున్.

వ. మఱియు నాలకింపుము

క. కరుణారససంభరితుఁడు
పశులను హింసింపనట్టిపావనుఁడు సమా
దరపూర్ణుఁడు తృప్తింగను
నరుఁడే నరుఁడంచు నీవునమ్ముముతండ్రీ.

క. ఇతరులమేలు సహించెడి
మతిమంతుఁడు సత్యమూర్తి మఱియు నహింసా
వ్రతదీక్షాకంకణుఁడే
స్తుతికర్హుఁడు పాప మతనిచూడదు నాన్నా.

క. వినయం బనయం బెవ్వని
మనమునఁదనరారు నట్టిమానవుఁడు జగ
జ్జనసేవితుఁ డనుకొనఁదగు
ననుమానములేదు నిశ్చయం బిది వినుమా.

క. కోపంబుఁ దాపముఁ బటా
టోపము నెవ్వండువిడువఁడో యాతనికే
దాపైయుండును నిత్యముఁ
బాప మ్మద్దానఁగల్గు బహువిధబాధల్. 206

సీ. ఏ మనుజుండు తృప్తి నివహించుచు నిత్యము విశ్వసోదర
ప్రేమసుధారసంబులను బిండునొ? యే కరుణారసాబ్ధి ని
ష్కామతపఃప్రభావమునఁగ్రాలునొ? యా మహనీయు లౌకిక
క్షోమము తాఁకునే యుగయుగంబుల నాతఁడునిల్వకుండునే. 207

వ. కడచిన దానికి వగవకుము 208

క. ఎఱుఁగక ముందొనరించిన
దురితమ్ములకేమి యవియతొలఁగెడి నీఁకముం
దెఱిగి యవి సేయకుండుట
పరమజ్ఞానులకు ధర్మ్యపథము కుమారా. 209

క. అనుమానము మానవునకుఁ
బెనుభూతంబండ్రు దానిఁబెనుపక విడువం
జను నట్లు నీవు గతమును
మనమునఁదలఁపక మెలంగుమా సుఖమలరున్. 210

క. గతజన్మమెల్ల సమరో
ద్ధతితో నత్యాశతో వెతంబడె నిపు డె
త్తితి వొకజన్మ మహింసా
వ్రతమున నద్దానిఁ గడపవలయును బిడ్డా. 211

వ. మఱియు నింకొక్క విశేషంబు గలదు 212

క. పాపమ్ము నణఁచుఁ బశ్చా
త్తాపము మానవున కదియదారి భవంబుం
బాపుకొనుట కిపు డది నీ
లోపలఁగన్పించె నా విలోకనములకున్. 213

చ. వదలకుమన్న ! బుద్ధభగవానునిబోధ మిదేకదా ? సదా
హృదయమునందునిల్పుము జయేందిర నీకు లభించు శాంతిసం
పద లలరార రాజ్యపరిపాలనచేయుము నిత్యమున్ బ్రజా
భ్యుదయముఁగోరికొమ్ము భరతోర్వికిఁ గీరితిఁదెమ్ము దీక్షమై.

బౌద్ధభిక్షు వశోకునికి రాజధర్మమ్ము లుపదేశించుట

వ. ఇఁక రాజధర్మముల వక్కాణించెద నాలకింపుము 214

గీ. స్వమత పరమతముల నొక్క సరణిఁజూచి
ముందుముందప్రజాభీష్టముల నెఱింగి
తిరుగఁదగుఁగాక దుర్నియంతృత్వమూనఁ
దలఁచు నృపతికి దుర్గతుల్ తప్పవన్న. 215

క. ఒకవర్గముపై దయ నిం
కొకవర్గముపై నసూయ నుంచిన రాజుల్
తికమకలు చెందెద రొకా
నొకసమయంబందుఁ బొరులొప్పరువారిన్. 216

గీ. కష్టజీవుల పిక్కబెక్కలబలంబు
రాజ్యమునకెల్ల (శ్రీ)రామరక్ష కాన
వారివిశ్వాసమును గాంచవలయు నొడయఁ
డట్లుకాకున్నఁ దొలఁగు సింహాసనమ్ము. 217

గీ. కష్టజీవులు కన్నీరుగార్చిరేని
వెడలుఁ దత్కంకణములలో విప్లవాగ్ని
దానినార్పఁగ నెవ్వారితరముకాదు
బ్రతుకునే భూధవుఁడు ప్రజాబలముముందు. 218

వ. అదియుంగాక 219

ఆ. గద్దెనెక్కుమాత్ర గర్వంబుఁదాలిచి
మన్నుమిన్ను దెలియకున్న రీతిఁ
బ్రజలమఱచితిరుగు పాలకవర్గంబు
మేలుఁగనునె నేలఁ గూలుఁగాని. 220

క. నాలుగుకాలంబులు పరి
పాలించిననేమి రాజు ప్రజకుం దలలో
నాలుకవలెఁ దిరిగినఁ గల
కాలము గౌరవము నందఁగలఁడు కుమారా! 221

క. అని బౌద్ధభిక్షుకుఁ డశో
కునకెంతో జ్ఞానధనముఁ గూరిచి తగుదీ
వనలిచ్చి యింకఁబొమ్మని
వినయముతోఁ జెప్పి లేచి వెడలెను మిత్రా! 222

ఆ. పరుస మినుముసోఁకి బంగారమున్ జేయు
కరణి బౌద్ధభిక్షుక ప్రవక్త
వడి నశోకచక్రవర్తిని విజ్ఞాన
మయుని జేసి శాంతమతిఁగ మార్చె. 223

క. జడివానగురిసి పిమ్మటఁ
గడుఁ దేటి పయోద మొకవికాసముతో ని
ల్చెడిగతి నాఁడయఁడు తొలి దుం
దుడుకులు విడనాడి కరుణతో వర్తించెన్. 224

వ. తదాది నయ్యశోకచక్రవర్తి పరిపాలించిన క్రమం బెఱింగించెద. 225

అశోకుని ధర్మ పరిపాలనము

సీ. సౌఖ్యమిచ్చున దహింసామార్గమంచు గు
ర్తించినాఁ డందు వర్తించినాఁడు
హాయిఁ గూర్చునది సత్యవ్రతంబంచు
భావించినాఁ డదియ సేవించినాఁడు
మంచిఁ జూపునది ధర్మజ్ఞాన మంచు శో
ధించినాఁ డద్దిబోధించినాఁడు
శ్రమము నీయనిది విశ్వప్రేమ యంచు నా
ర్జించినాఁ డెల్ల వర్జించినాఁడు

గీ. ఘనతఁ దెచ్చునది పరోపకారమంచుఁ
దలఁచినాఁడందు సతతంబు నిలిచినాఁడు
జీవితాంతము వఱకు నిశ్చింతదాల్చి
ప్రజల నేల నశోకభూపాలవరుఁడు. 226

గీ. పశువులకుఁ బక్షులకు నరప్రకరమునకు
నాయురారోగ్యభాగ్యంబు లందఁజేయఁ
దలఁచి యూరూర వైద్యశాలల నమర్చెఁ
బ్రజలు మెచ్చ నశోకభూపాలవరుఁడు. 227

క. దూరములఁ జూపు శిలల న
పారముగా నిల్పెఁ బల్లెపల్లెల సత్రా
గారంబుల నెలకొల్పె ను
దారగుణుం డంచుఁ బౌరులందఱు మెచ్చన్. 228

ఆ. తాత చంద్రగుప్త ధరణీతలేంద్రుఁడు
కథియవాడ నిల్పఁగలిగినట్టి
ఘనతటాకమునకుఁ గట్టించె సేతువు
కర్షకప్రజోపకారసరణి. 229

వ. వెండియు 230

గీ. శీతలచ్ఛాయలనొసంగు చెట్ల నాటి
లలితకళఁజూపు పాఠశాలల నమర్చి
పంట లభివృద్ధిచేయు కాల్వాలసృజించి
ప్రజలమెప్పించెఁ దద్ధరాపాలకుండు. 231

క. లలిత లతాసుమదళఫల
కలితారామములఁ బెక్కు గల్పించి మహా
ర్షుల కాశ్రమముల నెన్నో
నిలిపె మహాభక్తినూని నృపుఁడు కృపాత్మా. 232

సీ. కట్టుబట్టలులేక కంటనీరిడువారి
కందజేసెను నూతనాంబరములఁ
బొట్టకూటికిలేక పొగులుచుండెడివారి
కర్పించె మధురపక్వాన్నరాశిఁ
జెట్లనీడలవసించి తపించువారల
కమరించిపెట్టె గేహములు పెక్కు
వెట్టిచాకిరిబాధ విలపించువారికి
దయతోడఁజూపె స్వాతంత్ర్యపథము

గీ. పట్టుపట్టి ప్రజలబంధించి బాధించు
చెట్టకులపుగుట్టు నెట్టివైచి
మానధనముఁగూర్చిమన్నించె సమదృష్టి
సాకె ధర నశోకచక్రవర్తి. 233

సీ. కదలి గంతిడు నదీనదజలంబులఁగూర్చి
పంటకాల్వలనిండ బాఱఁజేసి
పటులోహదారుసంపద వృద్ధిగావించి
తఱచుగాఁ గృషికసాధనములొసఁగి
యార్జితద్రవ్యసాహాయ్యంబు నొడగూర్చి
పొలమంతటికి బలంబలరఁజేసి
గిరుల బంజరులఁబుల్లరిపన్నులనుద్రోసి
పశుసంతతికి మేఁత ప్రబలఁజేసి

గీ. యన్యమతములఁగని తూలనాడఁబోక
యభ్యుదయమార్గములకుఁ దా నడ్డురాక
ప్రజలబిడ్డలఁబోలెఁగాపాడి యశము
దిగ్దిగంతాలనిల్పె ధాత్రీధవుండు. 234

క. పౌరవరు లంత మాంసా
హారమును బరిత్యజించునట్టుల శాకా
హారములఁగొనెడి రీతులఁ
గూరిచె శాసనము హింస కూడదటంచున్. 235

చ. కవులను గారవించె బుధకాండమునెల్లనుతించె గాయక
ప్రవరులనాదరించె జనపాలురస్నేహముఁబెంచె బౌద్ధవుం
గవులకు నాశ్రయమ్మొలిడెఁ గమ్మనిరూపున ధర్మచక్రమున్
భువిపయినిల్పె దీక్షఁగొని భూపతి యెంతపవిత్రశీలుఁడో. 236

వ. నానా దేశంబులకుఁ బ్రవక్తలనంపి ధర్మప్రబోధములు చేయించె. శిలాఫలకములపై బౌద్ధధర్మమ్ముల సువర్ణాక్షరములతోఁ జెక్కించి నిలిపె. 237

గీ. అ య్యశోకుని ధర్మచక్రాంకమిపుడు
రమ్యముగనిల్చియుండె భారతపతాక
నమ్మహాపాలనమ్ము ప్రత్యక్షమైన
నాఁడు ప్రజలందఱకు మహానంద మొదవు. 238

వ. అశోకుని యనంతర మాతని సంతతివారు రాజ్యమేలిరని నాగార్జునపర్వతము దరి వెలసిన శిలాశాసనముల వలనఁ దెలియనగుఁ గడపట 239

నంగులు - కణ్వులు

ఉ. ఆతనివంశజాతుఁడు బృహద్రథుఁ డిమ్మహి కీశుఁడై మహా
పాతకుఁ బుష్యమిత్రుఁడను వాఁనిని మంత్రిగ స్వీకరింప దు
ర్నీతికిఁజిక్కి యాతఁ డవనీతలనాథుని జంపె సైనిక
వ్రాతముఁజూడ రమ్మని నెపమ్ము ఘటించి కృతఘ్నుఁడై కటా. 239

వ. ఆయనయే సంగవంశస్థాపకుఁడు బ్యాక్ట్రియారాజునకుఁ జుట్టమగు మేనాండరు నోడించి కీర్తిఁగాంచె నశ్వమేధయాగ మొనరించెఁ గొంతకాల మాతని వంశము వారుర్వినేలిరి. 240

ఆ. సంగవంశభవుఁడు సదమలశీలుండు
దేవభూతి యనెడి భూవరుండు
చివరివాఁడు మంత్రిచే హతుఁడైపోయె
నతనితోడ వంశ మంతరించె. 241

వ. ఆ మంత్రియే వాసుదేవనాముఁడు కణ్వవంశస్థాపకుఁడు. 242

మ. అలనాఁడే విలసిల్లె బ్రాహ్మణమతం బత్యద్భుతంబొప్ప ను
జ్జ్వలమై దేశమునాక్రమించె మనుశాస్త్ర ప్రజ్ఞ యాచార్యవ
ర్యుల పీఠంబులు రాచగద్దియల నుజ్జృంభించె దుర్వాదముల్
బలముంగొన్నవి నిండిపోవుచుఁ బ్రజాబాహుళ్య మం దంతటన్.

వ. పిమ్మటఁ గొంతకాలమునకు 243

మ. విలసన్మూర్తులు యుద్ధవీరులు జగద్విఖ్యాతచారిత్రు లాం
ధ్రులు తత్త్రాణ్వులఁ బాఱఁద్రోలి విబుధేంద్రుల్ మెచ్చఁగా మూఁడువం
దల యేండ్లేలిరి వారిజీవితచరిత్రల్ గద్యపద్యాత్మకం
బులు కాకున్కి సమీక్షసల్పి విశదంబుల్ చేయలే రెవ్వరున్. 244

వ. మఱియు నొక్క విశేషంబు తెలియఁదగు నదేమన బాక్ట్రియనులు
పార్థియనులు సిథియనులు కుషానులు నల్గాండ్రార్జించిన రాజ్యముఁ
బంచికొని రానురాను హిందువులైపోయిరి. యటుపిదప వెలసిన
గుప్తరాజ్యమునంగల విశేషంబుల విశదీకరింతు వినుము. 245

గుప్తరాజులు - స్వర్ణయుగము

చ. పలువురు గుప్తరాణ్మణు లపారకృపానసముపేతులై ధరా
వలయమునేలిపోయి రది స్వర్ణయుగంబని పెద్దలందఱున్
బలికెద రాన్నృపాగ్రణులఁ బ్రస్తుతికెక్కె సముద్రగుప్తుఁడన్
విలసితమూర్తి శౌర్యనిధి వీరవరేణ్యుఁడు సద్గుణాఢ్యుఁడై. 246

వ. అతఁడు వత్సరత్రయంబు దిగ్విజయయాత్ర సాగించి. 247

గీ. సకలరాజులగెల్చి విశ్వంబుమెచ్చ
నశ్వమేధమహాయజ్ఞ మాచరించె
నదిమొదలు యుద్ధమనుమాట నాలకించి
యెఱుఁగడయ్యెను ద న్మానవేంద్రుఁడౌర. 248

వ. భాషాపోషకుండు సమస్తవిజ్ఞాననిధియు నగు నా సముద్రగుప్తుని యనంతర మతని కుమారుఁ డుచంద్రగుప్తుండును దండ్రివోలె సకల సద్గుణసంపన్నుండై రాజ్యమ్ము నేలె. నయ్యుగంబున. 249

గీ. కలఁడు హారిసేనుఁడను మహాకవివరుండు
రాజసంస్థానమునఁ గళాతేజమొప్ప
తన్మాతలేంద్రునిఁగూర్చి 'ప్రశస్తి'యనెడి
కావ్యమునువ్రాసె సద్యశఃకలితుఁజేసె. 250

ఆ. వినుము చంద్రగుప్తవిక్రమాదిత్యుండు
రాజసుతుఁడు శౌర్యరాశి యతఁడు
సంగరములయందు శకులను హూణుల
దఱిమి కొట్టినట్టి ధైర్యశాలి. 251

వ. అమ్మహాయుగంబున ఫాహియాన నను చైనీయుఁడు భారతదేశంబున కరుదెంచి నాఁటివైభవంబును గూర్చి గ్రంథమ్ములవ్రాసె. కుమారిలభట్టు శంకరాచార్యులు బ్రాహ్మణమత బీజంబుల నాటిరి. మహాశిల్పులనేకులు దైవశిల్పమ్ములనిర్మించిరి. మతపీఠంబులువర్ధిల్లె. తదుపరి కొంతకాలంబునకు రామానుజ మధ్వాచార్యాదులు తమ తమ మతధర్మములఁగూర్చి బోధించుట నీవెఱిఁగినదియ. వెండియు నయ్యుగంబున. 252

చ. అమృతరసంబు చిందఁగ మహాకవిచంద్రుఁడు కాళిదాసు కా
వ్యముల రచించె సుశ్రుతమహాశయుఁ డద్భుత మొప్ప వైద్యశా
స్త్రమునుడివెన్ వరాహమిహిరప్రభు వవ్యయదీక్షతో ఖగో
ళమును గ్రహించి పుస్తకములన్ బ్రకటించె బుధుల్ నుతింపఁగన్.

గీ. ఉజ్జయిని పట్టణమున మహోజ్జ్వలముగ
స్థాపనంబయ్యె నొక్క నక్షత్రశాల
పంచతంత్రంబును రచించి ప్రణుతికెక్కె
విబుధులం దా సమయమంద విష్ణుశర్మ. 254

వ. మఱియు దండిభవభూతిభారవ్యమరసింహభర్తృహరిబాణాది మహాకవు లయ్యుగంబున మహాకావ్యముల రచించిరి. 255

క. కలుములతో విద్యలతోఁ
దులదూఁగుచు నాఁడు సర్వతోముఖముగ వ
ర్ధిలె దేశము కావుననే
యలఘుమతుల్ స్వర్ణయుగ మటందురు దానిన్ 256

వ. తదుపరి వచ్చిన గుప్తరాజులు దుర్బలులగుటచే నాఁటి హూణుల దండయాత్రలకు లోపడి పోవుట సంభవించె. నయ్యనంతరము తోరమాణుని కుమారుఁడగు మిహిరగుఁడు రాజగుటకుఁ బ్రయత్నించుటయుఁ బ్రజలు సమ్మతింప కుండుటయు జరిగెఁ బిదప. 257

క. నరసింహగుప్తుఁడను నొక
ధరణీపతి హూణవరులఁ దలపడి వారిన్
వెఱచి సమస్త ప్రజలం
బరిపాలన చేసె ధర్మపద్ధతు లొప్పన్. 258

వ. ఆతని కుమారుండగు హర్షవర్ధనుండు షోడశవత్సరప్రాయమున సింహాసనమెక్కుట తటస్థించె. సమస్తసద్గుణాలంకారుఁడును వీర యువయునుంగాన నతండు ధైర్యముంబాయక. 259

హర్షవర్ధనుని పరిపాలన

చ. అనుపమశక్తియుక్తుఁడు దయాబ్ధి పరాక్రమశాలి విష్ణువ
ర్ధనుఁడు మహీంద్రుఁడై పలువిధంబులబాధలసైఁచి వైరిమూఁ
కను జెదరంగఁగొట్టి సుముఖమ్మగ రాజ్యమునుద్ధరించెఁ ద
జ్జనపతిశౌర్యధైర్యములుసాహసముల్ కొనియాడఁగాఁదగున్. 260

ఉ. శీలవతిన్ సురూపవతిఁ జెల్లెలి నిద్ధకళావతిన్ జయ
శ్రీలలనామణిన్ జెఱుకుఁజేరిచి బావనుజంపినట్టి యా
మాళవదేశనాథుఁ డసమానబలుండగు దేవగుప్తు ప్రా
ణాలుహరించి మించి విజయధ్వజమెత్తెఁ బ్రతిజ్ఞతీఱఁగన్. 261

గీ. తనసహోదరు రాజ్యవర్ధనునిఁ గపట
నాటకమునాడి వంగభూనాయకుండు
క్రూరుఁడు శశాంకుఁడువధింపఁ గోపమూని
వానివధియించి కీర్తిమై వసుధనేలె. 262

వ. పండితాగ్రణియగు నమ్మహీధవుండు నాగానందము, ప్రియదర్శిక, రత్నావళి యను గ్రంథములనురచించె. బాణుఁడనుమహాకవి యన్నరేంద్రునిగూర్చి హర్షచరిత్రాదుల రచించె. 263

గీ. ఆ నృపుండు మహాయానమాదరించి
సాధుపుంగవుఁడై సుధీసభలుగూర్చి
దన సమస్తము పేదసాదలకొసంగె
నోర్మిగూరిమి నైదేండ్లకొక్కమాఱు. 264

వ. హర్షునియనంతరము మగధరాజ్యము క్షీణింపఁగొంతకాలము దేశము గుప్తరాజులవశమై తదుపరి మొహమ్మదీయులఁ జేరె. 265

క. పొదకదలుఁ దీఁగఁదీసిన
వదలెద నాఘట్టమింక వత్సా! ముందు
న్నది ముఖ్యమైనచరితం
బదివివరించెదను దెల్లు లగపడెద రటన్. 266

శాతవాహనులు - పల్లవులు

చ. వినుము యువాగ్రణీ! తెలుఁగు వీరులగాథలు; తొల్లి శాతవా
హనులు మహానుభావులు ధరాధిపులై దయతోఁ బ్రజావళిన్
గనుఁగొని వారికిన్ సుఖము కల్గఁగఁ జేయుచు నాంధ్రరాజ్యపా
లనము నొనర్చియుండిరి కళాకలితంబగు వైభవంబునన్. 267

వ. శాతవాహన చక్రవర్తులకు. 268

గీ. ఘనయశశ్శ్రీలఁగన్న (శ్రీ) కాకుళంబు
రాజధానియయ్యెను; మహాతేజులైన
యాంధ్రరాజులలోఁ బేరు నందికొన్న
నేతయగు గౌతమీపుత్త్రశాతకర్ణి. 269

వ. ఆంధ్రచక్రవర్తులముద్రలపై నౌకాచిహ్నంబు లుండుటంబట్టి వారు సముద్రాంతరవ్యాపారపారీణులని తెలియనగు. మఱియునొక సమయమ్మున. 270

ఉ. చల్లనిచూపుతో విపులశౌర్యముతోఁ గ్రమచర్యతో మనః
పుల్లసరోజజాతమయి పొంగు దయాసుధతో వసుంధరా
వల్లభులై పవిత్రపథవర్తనులై ఘనులై రసజ్ఞులై
పల్లవరాజచంద్రములు పాలనచేసిరి కొన్నివర్షముల్. 271

ఉ. అందు మహేంద్రవర్మయు మహామహుఁడౌ నరసింహవర్మ రా
జ్యేందిర కేలుపట్టి సకలేప్సితముల్ సమకూర్చి యందమున్
జందముఁగూర్చి పౌరులకుసౌఖ్యముఁజూపి సమస్తసంపదల్
చిందఁగ రాజ్యమేలిరి వచింపఁగశక్యమె? నాఁటికాలమున్. 272

గీ. బ్రహ్మశిల్పుల దీక్షాతపస్సువలన
నద్రులను నిండె దైవగుహాలయములు
శైవమతము విశాలాంధ్రజగతిఁ బ్రాఁకె
నా మహేంద్రుని పాలనం బలరువేళ. 273

వ. నరసింహవర్మమహావీరుఁ రెండవపులకేశినోడించి వాతాపినర సింహుఁ డనుపేరువహించె. గొప్పనౌకాదళంబునునిర్మించి మహా మల్లుఁడను విఖ్యాతినార్జించె. 274

ఉ. ఆ కరుణామయుల్ స్థపతులందఱఁబిల్చి ఫల ప్రసూనముల్
చేకొని పూజఁజేసి యొకశిల్పముఁజూపుఁడటంచు వేడ దీ
ప్తాకలితాత్ములై యుగయుగ ప్రజచూచితరింప వేడ్కతో
నేకశిలారథంబుసృజియించిరి పెంచిరి కీర్తిసంపదల్. 275

చోళులు - చాళుక్యులు

వ. మఱియొక కాలంబున సత్యగుణగణాలంకారులును వీరశేఖరులును నగు చోళులు పరిపాలించిరి. 276

క. చోళధరారమణులకుఁ
జాళుక్యనృపాగ్రణులకు సంగ్రామంబై
కాలదశవలననోడిరి
చోళులు చాళుక్యులీవసుంధరఁగొనఁగన్. 277

వ. కాని చోళులలందు సుప్రసిద్ధుఁడగు రాజరాజును, దదనంతరము వారియందు గొప్పవాఁడగురాజేంద్రచోళుఁడును యుద్ధవీరులై ప్రఖ్యాతివడసిరి. యందుఁబ్రథముఁడు దక్షిణహిందూదేశమంతయు జయించి తంజాపురమున బృహదీశ్వరాలయంబుఁగట్టించె. ద్వితీయుఁడు గంగాతీరమువఱకు జయించి 'గంగయకొండ' బిరుదు వహించి యండమాన్ నికోబార్ ద్వీపముల జయించి పాలించిన వీరుఁడు. మఱియొక వేళ 278

ఉ. సంగరరంగనిర్దళితశాత్రవుఁ డస్త్రకళాధురంధరుం
డంగజతుల్యరూపుఁడు శతాంగమతంగతురంగవాహనో
పాంగపదాతిసైన్యచతురంగబలప్రకరంబుతోఁ గులో
త్తుంగుఁడు రాజ్యమేలె సుమతుల్ మదిమెచ్చి శిరంబులూఁపఁగన్.

యాదవులు - కాకతీయులు

ఉ. ఆదరణన్ గనుంగొనుచు నార్తుల నన్నలుతమ్ములట్లు మ
ర్యాదలసంచరించుచు ధరాతలనాయకులై బలాఢ్యులై
యాదవరాజులొక్కసమయంబున నేలిరి సర్వమానవుల్
మోదమునంద ధర్మబలమున్ గొని గద్దియనెక్కి దీక్షతో. 280

వ. మఱియొకసమయంబున హొూసలులుపరిపాలించిరి. భక్తులగుట వారనేక దేవాలయముల నిర్మింపఁజేసిరి మహాశిల్పులు, సకల విద్యాధురంధరులగు జక్కనాచార్యులును దనకనాచార్యులును వారిచే సన్మానింపఁబడిరి. 281

మ. వరణీయోరుచరిత్రులై రణకళాపారీణులై వైరిభీ
కరులై సర్వహితక్రియాచరణదీక్షాదక్షులై శౌర్యధై
ర్యరమాభూషణులై జగజ్జనుతోద్యత్కీర్తివిస్తారులై
పరిపాలించిరి కాకతీయనృపతుల్ ప్రజ్ఞానవిద్యానిధుల్. 282

వ. ఇంకనొక కాలంబున. 283

ద్వివిధ పాండ్యులు

క. ఇరుతెగలవారు పాండ్యులు
పరిపాలించిరి ధరాధిపతులై మధురా
పురి రాజధానిగా సు
స్థిరమతులొప్పారఁ జెక్కుచెదరని కీర్తిన్. 284

క. పాలించినా రొకానొక
కాలంబునఁ జేరు లను వికాసనికాయుల్
మేలొడ గూర్చుచుఁ బ్రజలకు
(శ్రీ) లలరన్ దేశమందుఁ జెలిమిన్ బలిమిన్. 285

వ. వెండియు విజయనగరాధిపతులును మఱికొందఱు మహారాజులును రాజ్యమేలుట నీవెఱింగినదియ. కావున నిఁక మొహమ్మదీయదండయాత్రల క్రమంబు వివరింతునాకర్ణింపుము. అపుడు. 286

క. అంతఃకలహంబులతోఁ
బంతంబులతో విరోధభావమ్ములతో
గంతులిడుచున్న మనభూ
కాంతులు రాజ్యంబులేలుకాలమ్మగుటన్. 287

వ. హైందవరాజులు పరస్పరాసూయలఁ బెనంగులాడుచుండి రను వార్తలు జగంబునఁ బ్రాఁకె. నాసమయమ్మున. 288

గీ. తలుపుతొలఁగిన గృహముఖద్వారమట్లు
కంచెచెదఱిన ఫలభూమికరణిఁదోఁచె
నంతుదొరుకని సిరులతోనలరుచున్న
భరతఖండము సర్వప్రపంచమునకు. 289

వ. దుర్దశలుసమకూరునప్పుడన్నియు నట్లుకూడివచ్చునని పెద్దలువచించుచుందురు. విధివిధానము నెవ్వరునుతప్పిచరింపనేరరని నీవు నెఱుంగుదువు. దానికి వగతంబనిలేదు. కానఁదదుపరికథాక్రమంబు వినుతు నాకర్ణింపుము. 290

## గజనీమొహమ్మద్ దండయాత్ర

చ. నిరుపమశౌర్యరాశి గజనీ మొహమద్ మనదేశ మెంతయో
సిరి నలరారునంచు గురుజీవమణుల్ నవరత్నరాసు లీ
ధరవిలసిల్లునంచు ధనధాన్యనిధుల్ ఖనిజాదిసంపదల్
విరివిగఁ జిక్కునంచు శరవేగముతోఁ బయనించె నీదెసన్ 291

క. ఆరంభించెఁ దొలుత లా
హోరుపయిన్ దాడి నయగుణోజ్జ్వలుఁ డౌ నా
భూరమణుని జయపాలుని
క్రూరతతో గెల్చి కొల్లగొట్టె ధనంబున్ 292

వ. మఱియు భద్రంబుగ దాఁచిన షోడశ మణిహారమ్ములఁ గైకొని చను టయు నప్పరాభవమ్మున కోర్వఁజాలక జయపాలమహీంద్రుండు రాజ్యంబును దనకుమారుఁడగు నానందపాలునకప్పగించి యసువు లంబాసె. 293

క. తనవంతు కప్పమీ లే
దను నెపమున సైన్యయుక్తుఁడై రెండవ దా
డిని సాగఁజేసె భటియా
జనపాలుని పైని గజనిసాహెబు దీక్షన్ 294

మ. పటుదర్పప్రతిభాధురంధరుఁడు శుంభద్విక్రమోపేతుఁడౌ
భటియారాణ్మణి సైన్యమున్ గొని రిపున్ బంధింపనుంకించె నం
తట యుద్ధం బతితీవ్రమయ్యె భయదధ్వానంబు మిన్నంటె ది
క్తటముల్ క్రక్కదలంగ ఖడ్గశరశస్త్రజ్వాలలున్ బొంగఁగన్

వ. ఆ మహాహారణంబున గజనీ మొహమ్మదు సైన్యంబు బలహీనంబై వెన్నుఁజూపఁదొడంగె. అంతఁ దురుష్కభూపాలుఁడు పాఱఁ జొచ్చిన తనవాహినిని నిల్పి మక్కా వైపు తిరిగి ప్రార్థన చేసినట్లభిన యుంపుచు భగవంతుఁడు మనపక్షంబుననుండె నీఁకరండని సైనికుల నాహ్వానించి మరల రణంబునకుఁ దలపడె. 296

ఉ. ఆ రణరంగమందు భటియూనరపాలుఁడు పోరిపోరి వే
సారఁదొడంగె సైన్యములుసత్త్వవిహీనములయ్యె శత్రువే
మీరి జయంబుఁగాంచి బలిమిన్ ధనరాసుల రత్నరాసులన్
జారుసువర్ణరాసుల వెసంగొనిపోయె ముదంబుఁజెందుచున్ 297

శా. దాడిన్ జేసె ధనాశచేఁగదలి ముల్తాన్ చేరి యబ్దుల్ పటీ
లోడీపై గజనీవిభుండు లయకాలుంబోలివిచ్చేసి పో
రాడన్ జూచెడిశత్రువుంగనుచు నత్యాందోళితస్వాంతుఁడై
యోడెన్ లోడి వినమ్రుఁడై యొసఁగె నెన్నోరత్నభండారముల్.

వ. పిదపఁ గాష్గరురాజగు హీరటుపైదూఁకి యతనినిర్జించి తానార్జించిన రాజ్యంబునొకమతభ్రష్టుండగు హైందవుని కప్పగించి చనియె. అట్లు

క. పదునెనిమిదిసారులు దాఁ
గదలించెను సైన్యములను గడపటియుద్ధం
బదనముగసాగె మొహామద్
కదనంబుఫలించె రాజగణములుబెదరన్. 300

గీ. కోట్లకొలఁదిగ ధనమునుగొల్లగొట్టి
ఘన కనకవస్తువాహనగణమునంది
యర్చకులనెట్టి సోమనాథాలయమును
బ్రద్దలొనరించి రత్నసంపదలఁగొనియె. 301

క. చింతింపనేల మనభూ
కాంతుల కానాఁడు తలలుగలియక పరభూ
కాంతులకు లొంగిపోయిరి
యంతఃకలహంబులేరికైనన్ దగునే. 302

## ఘోరీమొహమ్మదు దండయాత్ర

వ. మఱికొంతకాలంబునకు 303

క. అదనంబుగ ఘోరీ మొహ
మదు సైన్యముఁ బ్రోనొనర్చి మదఘీంకృతులన్
గదలిచనుదెంచి భారత
సదనము నాక్రమణచేయ సంసిద్ధపడెన్. 304

వ. ప్రథమమున జరుపుదండయాత్రను డిల్లీరాజేంద్రుఁడగు పృథ్వీ
రాజు తనసైన్యములఁ బంపి యణఁచివేయుటయు నతండు పగబూని
మరలసైన్యముతోఁ జనుదెంచుటయు జరిగె. నప్పుడు 305

క. ఘోరీ మొహమద్ భారత
ధారణి పైదూఁకుచుండు తరుణంబునఁ బృ
థ్వీరాడ్జయచంద్రుల మది
నారంభమ్మయ్యె వైర మత్యుగ్రదశన్ 306

వ. తత్కారణం బెఱింగించెద నాకర్ణింపుము. 307

గీ. రాణిసంయుక్త జయచంద్రరాజతనయ
తనమనంబునఁ బృథ్వీరాజును వరించె
నతనిశౌర్యంబు ధైర్యసాహసము లెఱిఁగి
రూపసంపదలరసి యారూఢభక్తి. 308

గీ. తనవిరోధిని బృథ్వీరాజును వరించెఁ
దనయ సంయుక్త యంచుఁ జిత్తమునఁ దల్లి
సమ్మతింపక తండ్రి దేశముల కెల్ల
వార్తలందించె సుత స్వయంవరమటంచు. 309

రాణిసంయుక్త పృథ్వీరాజును వరించుట

వ. కాని పృథ్వీరాజు నాహ్వానింపఁడయ్యె. నట్లాహ్వానింపకుండుటయు
కాక పృథ్వీరాజువిగ్రహంబును వికృతాకారముగనిర్మింపఁజేసి
స్వయంవరసభామంటపద్వారంబున ద్వారపాలకునితెఱంగున నెల
కొల్పె. 310

చ. సకలధరాధినాయకులుఁ జక్కనిరాజకుమారులంత వే
దికల నలంకరింపఁ జనుదెంచిరయంబున రాజపుత్రి మా
లికఁగొనిపోయి సుంతయుఁజలింపక జంకక పృథ్వీరాజ రూ
పకమగు విగ్రహంబుపయిఁవైఁబడవేసె సభాముఖమ్మునన్. 311

ఉ. అంతకుముందువచ్చి ధవళాశ్వముతోనిలుచుండి నాఁటి వృ
త్తాంతము మెఱుంగుచుండెను రహస్యముగా నొకమాఱురూపుతో
గాంతుఁడుపృథ్వీరా జతఁడు గ్రక్కున రాజకుమారిఁగొంచు న
త్యంతముదమ్ముతోబయనమై పురిఁజేరె బుధుల్ సెబాసనన్ 312

వ. నాఁటినుండి జయచంద్రుఁ డతనిపైఁ పగఁబూని యతనివంచింపఁ
దలంచి ఘోరీమొహమ్మదున కండయైనిలిచి చతురంగబలముల
సాహాయ్యమునంపె నంత 313

మ. కదలెన్ సేనలఁగూర్చి నాల్గుదిశలంగ్రమ్మించి ఘోరీమొహ
మ్మదు పృథ్వీధరణీతలాధిపునణంపన్ రాజపుత్రుల్ మహా
కదనంబందెదిరించిపోరిరొకదీక్షన్ శత్రుసైన్యంబులన్
దుదముట్టించిరి పారఁజొచ్చిరియరాతుల్ గుండియల్ జాఱఁగన్. 314

పృథ్వీరాజు యుద్ధము

వ. రిపుసైన్యంబట్లు పాఱుచుండుటనెఱింగి 315

ఉ. అన్యధరాతలేశ్వరుని కండగనిల్చి యతండుసూపుదా
ర్జన్యముసైఁచి తోడు నిజసైన్యమునంపెఁగదా కనోజురా
జన్యుఁడు సిగ్గులేనిజయచంద్రుఁడు ఘోరిజయించెనేనినే
ధన్యుఁడనౌదునంచు నెడఁదన్ దలపోయుచుమందభాగ్యుఁడై. 316

వ. అత్తెఱంగెటింగి 317

మ. కరవాలంబుధరించి నేత్రముల రక్తజ్వాల లుప్పొంగ సం
గరరంగంబునఁబేరుగాంచినతురంగంబెక్కి హుమ్మంచు ము
ష్కరసేనానివహంబునన్ దుమికి దీక్షన్ బోరిచెండాడె నే
వెఱపుంజెందక శత్రుసైన్యమును బృధ్వీరాజు రుద్రాకృతిన్. 318

చ. సమరమునం బలాబలవిచక్షణచేయుచుఁ బృధ్వీరాజు ధ
ర్మముగఁజరించునయ్యెడ నరాతు లరీతుల సంచరించి రా
సమయమునందక్రమ్మి జయచంద్రునిసేనలు ఘోరయుద్ధ మ
క్రమముగ సాగ శాత్రవులగర్వమమాంతము రేఁగెఁ బట్టునన్.

మ. సమరంబం దమరప్రతాపమునునిశ్శంకమ్ముగాలేపి స
క్రమశౌర్యంబునుజూపి హైందవపవిత్రక్షాత్రరేఖాసమూ
హములన్ భాసిలి పృధ్వీరాజు రిపుసంహారమ్ముఁగావించి ఘో
రముగాఁబోరుచు నవ్యయంబుఁగనె వీరస్వర్గమార్గంబునన్. 319

వ. ధనేశ్వరరణరంగంబునం దట్లుజరుగుటయు వెన్వెంటనె 320

రాణి సంయుక్త యుద్ధమునఁ దండ్రిని దూషించుట

ఉ. శక్తివెలుంగఁబోరి రిపుసంహరణంబొనరించి కత్తికిన్
భుక్తినొసంగి ప్రాణపతిపోయె నటంచుఁ జలించి రాణిసం
యుక్త తురంగమెక్కి రభసోద్ధతి సంగరమందుదూఁకె వీ
రోక్తులుమింటినంట బహుళోజ్జ్వలశౌర్యము పొంగుచుండఁగన్.

చ. సమరమునందుదూఁకి రిపుసైన్యము నుక్కడఁగించుచున్న యా
సమయమునందె తండ్రిజయచంద్రుఁడుకన్పడె నంత రాణియా
కుమతినిఁజూచి కన్గొనల గుప్పుననిప్పులురాల వీరకం
రముఁగదలించి భీకరనినాదముతో వచియించె నిట్టులన్. 322

ఉ. లగ్గొడగూడునంచు నుబలాటముతో రిపుఁజేరిలొంగి సి
గ్గెగ్గులవీడి భారతమహీజనపౌరుషమంజురేఖలన్
బుగ్గినొనర్పనెంచినకుబుద్ధివి ? నాహృదయంబునిక్ గనన్
భగ్గులమండుదేశపరిపంథివి నీవొకమానవుండవే. 323

ఉ. కచ్చవహించి పెద్దమొనగాఁడనటంచుఁదలంచి పోయి? యా
మ్లుచ్ఛుల కండవైనిలిచి మోసముఁజేసిమమున్ వధింపఁగా
వచ్చినద్రోహి! దివ్యమగువంశము నీజననంబుచేతఁ బె
న్మచ్చధరించెఁ బాపముసుమా! నినువేకువలేచిచూచినన్. 324

ఉ. నేనొకవీరశేఖరుని నిర్మలకీర్తిని నస్త్రశస్త్రవి
ద్యానిధిఁ బెండ్లియాడుటలురా? యవమానమునీకు, భారత
స్థానమునందుఁబుట్టి రిపుజాతికిఁజాకిరివాఁడవౌటయే
మానవిహీన! నీకుబహుమానముపొమ్ము జగంబునవ్వెడిన్. 325

క. ఇదియాపంతము స్త్రీలకు
హృదయంబులులేవటంచు నెంచితివో? నీ
మదియందు విశ్వవిశ్వముఁ
గదలించెడు జాతియిదియ కనుమిఁకనైనన్. 326

చ. అని యనిదూఁకి శత్రునివహమ్ముల నుక్కడఁగించి రక్తవా
హినులనుబాఱఁజేసి హృదయేశ్వరుపంతముఁదీర్చి దుందుభి
ధ్వనములు మ్రోఁగ వీరవనితామణియంచుసమస్తనిర్జరాం
గనలునుతించిమెచ్చికొనఁగన్ బతిఁజేరె సురాలయంబునన్. 327

ఉ. వరికిసాయమైనిలిచి యా ఘనకార్యమొనర్చిభారతా
చారమునేలఁగూల్చి జయచంద్రుఁడు చంకలఁగొట్టికుల్కెనో
వారె విరోధులై కదలివచ్చి పయింబడివానిఁజంపి రౌ
రౌర! వచింపఁగూడదుగదా? పెఱవారికి నింటిగుట్టులన్. 328

ఖిల్జీయులు, తుగ్లకులు, సయ్యదులు, లోడీయులు

క. కుతుబుద్దీనను వానిని
ప్రతినిధిగానిల్పి ఢిల్లిపట్టణమునఁ దా
మృతుఁడయ్యెఘోరి, కావున
నతఁడే సుల్తానసంగ నధిపతియయ్యెన్. 329

క. బానిసయై బ్రతుకుటచే
వానికి సుల్తానుపదవివచ్చినఁ గుతుబు
ద్దీను నతనిపుత్త్రాదుల
బానిసవంశస్థులంచుఁ బలికిరి విబుధుల్. 330

క. పోయిరి వా రటుపై ఖి
ల్జీయులు సుల్తానులైరి చిత్రంబుగ న
ల్లాయుద్దీనుప్రముఖుఁడు
హాయిగసింహాసనంబు నధిరోహించెన్. 331

ఆ. అతఁడు దండయాత్రలత్యద్భుతంబుగా
సాఁగఁజేసె ధరణిసంగ్రహించెఁ
గాకతీయు లోరుగలునేలుచుండఁగ
వారినణఁచి కొనియె వసుధనెల్ల. 332

వ. అతనిసేనానియగు మాలిక్ కాఫరునకుఁ దెలంగాణము, మైసూరు, ద్వారసముద్రము వశమయ్యెఁ బిదపఁ దుగ్లక్ వంశీయులు సుల్తానులైరి. కడపటితుగ్లక్ సుల్తానుకాలమున సామర్ఖండునుండి తైమూరనునాతఁడు దండెత్తివచ్చి ఢిల్లీనాక్రమించికొని తన ప్రతినిధిగ సయ్యద్ ఖజ్రికానునుంచె వానియనంతరము లోడీవంశీయు లీనేల నేలిరి వారిలోఁ జివరసుల్తా నిబ్రహీంలోడి 333

మొగలుసామ్రాజ్యము

క. ఆ లోడీనోడించెను
దౌలత్ఖానునిరహస్యతంత్రముచేఁ గా
బూలధిపతి బాబరుభూ
పాలుఁడుచెలరేఁగి పానిపట్టురణమునన్ 334

క. గోరీమొహమద్ యుద్ధము
ప్రారంభంబగుట మొదలు బాబరువఱకీ
భారతదేశస్థితి తా
ర్మాఱయ్యెను హైందవాళిమనుగడ చెడియన్. 335

క. పాలించిరిపో ? భారత
శీలమ్ములఁ జెఱుపనేల శిల్పమ్ముల గ
గ్గోలుగ నుగ్గొనరించుట
లేల పరమతంబులన్ సహింపమిఁగాదే. 336

క. నిలిపి బెదరించి మతమునఁ
గలిపికొనిరి హైందవులను గమ్మనిసిరులన్
దొలఁగించిరి దేవాలయ
ములబ్రద్దలొనర్చి రత్నములఁగొనిరన్నా. 337

క. జుట్టునకు బొట్టునకు సరి
గట్టించిరి స్త్రీలఁ జెఱుపఁగలిగిరి, కూలం
గొట్టిరి గుడులచ్చటనే
కట్టించిరి స్వీయమతము గ్రాల మసీదుల్. 338

క. కొందఱురాజులు మ్రందిరి
కొందఱు సామంతులైరి కొందఱు వలసన్
జెందిరి నాఁటి నవాబుల
క్రిందనిలువరాదటంచుఁ గిరితతికొఱకై. 339

వ. బాబ రాఫ్ఘనులఁగెల్చి పంజాబుబీరారులఁ జేపట్టి రాజ్యమేలెఁ దద
నంతరము హుమాయూన్ సింహాసనమెక్కెఁ గాని 340

గీ. ఆ హుమాయూను పిదప బీహారునేలు
ఘనుఁడు షెర్ఖానుతోనోడి కదలిపోయి
పర్షియాభూమిపాలుని బలముఁబొంది
యందికొనియెను ఢిల్లి సింహాసనమును. 341

అగ్బరుచక్రవర్తి పరిపాలనము

చ. అతని కుమారుఁ డగ్బరు ధరాధిపతిత్వము స్వీకరించి యు
న్నతదశనుఁగూర్చి పాలన మొనర్చి యశంబుగడించె మాల్వభూ
పతినిజయించి రాజ్యమునపారముగా వెలిఁగించి సర్వస
మ్మతముగసంచరించె నసమానపరాక్రమ విక్రమంబులన్. 342

క. అతని నెదిరించె దుర్గా
వతియను గాండ్వానరాణి వదలక సమరో
ద్ధతిఁజూపి పోరి కీర్త్యు
న్నతులంగనె భరతవీరనారియనంగన్. 343

ఆ. అతఁడు దండయాత్ర లాచరించును గాక
యధికరాజ్యకాంక్ష నలరుఁగాక
పాలనమున ధర్మపద్ధతులనుగూర్చి
హైందవైకతా బలార్థియయ్యె. 344

చ. సతము మతార్థసారములఁ జక్కఁగఁగ్రోలి ముదంబుఁ జెంది యే
కత నెలకొల్పి హైందవులగౌరవమున్ గణియించి మంచిప
ద్ధతులనుగూర్చి విశ్వవిహితంబుగ రాజ్యమునేలి నాఁటిపం
డితకవిగాయకాళి దెస నెయ్యముచూపియశంబుఁ జేకొనెన్. 345

వ. అగ్బరు తనరాజ్యంబును పదునైదు సుబాలుగ విభజించి ఫౌజు
దారుల నియమించి జిల్లాలనెలకొల్పి యున్నతాధికారులనియమించి
న్యాయశాఖలనిర్మించి వానిని ప్రత్యేకాధికారుల కప్పగించి
యార్థికశాఖకు వజీరునుంచి తోడన్ మల్లుమంత్రి సహకారముతో
సర్వే చేయించి భూమిశిస్తునిర్ణయించి యవమానకరములగు
జిజియామున్నగు పన్నులఁదొలగించి భగవద్భక్తితో రాజ్యంబు
చేసె నటుపిమ్మట 346

జహంగీర్, షాజహాన్, ఔరంగజేబ్, ప్రముఖులు

ఉ. భారతదేశమేలెనట్టుపై ఘనుఁడగ్బరుపుత్రుఁడౌ జహాం
గీరు జగంబునెల్లఁదలక్రిందొనరించిన గ్రీసు డచ్చివ్యా
పారమునాగెనప్పుడు కృపామయ! యాతనివెన్క షాజహాన్
ధారణినేలె నయ్యదియె తాజమహాల్ నెలకొల్పు కాలమున్. 347

గీ. సాహజసౌందర్యవతి ప్రియజాయయైన
తరుణి సుగుణాలభరణి ముంతాజిపేరు
శాశ్వతంబుగ నెలకొల్పి షాజహాను
చెలువుగులుకంగఁ బ్రకటించు శిల్పమదియ. 348

క. ఆ రాజకుమారుండే
క్రూరుం డౌరంగజేబు గుణనిధిఁదండ్రిన్
గారాగారమునందిడి
తారాజ్యమునేలె నన్నదమ్ములనణఁచెన్. 349

గీ. అన్యమతచింతనం బింతయైనలేక
పాపమనిజంకుఁగొనక నిర్భయతఁదాల్చి
యన్నివిధముల నన్యులనణఁచివైచెఁ
బన్నులవిధించె నెన్నెన్నొ పట్టుఁబట్టి. 350

గీ. ఆలయమ్ములుతాఁ బుమాత్రె మశీదు
లవతరించెను బాధించిహైందవులను
దనమతమ్మునఁగలిపి యుద్దండుఁడగుచు
రాజ్యమునువృద్ధిచేసె నౌరంగజేబు. 351

చ. హితులనులెక్కసేయఁడు సహింపఁడుహైందవజాతిమేలు నా
శ్రితులనుగౌరవింపఁడు చరింపఁడుధర్మమునందు సుంతయున్
మతసహనంబుఁజూపఁడు సమత్వమెఱుంగఁడు దేశమెల్ల దు
స్థితిఁబడె దుష్టపాలనమిసీ, యని నాఁడుతపించెనెంతయున్. 352

వ. అట్లు భారతరాజ్యంబును గడగడలాడించు మొహమ్మదీయుల
నెదుర్కొని జీవితాంతమువఱకుఁ బోరిన మన వీరనాయకుల చరి
త్రంబుల వినుతు 353

శ్రీకృష్ణదేవరాయలు

క. త్రిజగద్వీరుండు మహా
భుజబలుఁడౌ విజయనగరభూపతి తత్త్ర
ద్రజనీచరులన్ జెండుచు
విజయధ్వజమెత్తెఁ దెల్గువీడు వెలుంగన్. 354

క. పలుకు వెలఁది దలవాకిటఁ
గలిమిపడఁతి నింట మంచుగటుకు మాటిన్
దలఁపునఁ గీరితి చెలిది
క్కులనిల్పిన ఱేఁడతండు గుణనిధి వినుమా. 355

ఉ. మానవనాథసింహుఁ డసమానబలంబున బీజపూరుసు
ల్తానులఁ బాఱఁగొట్టి సువిధానములన్నెలకొల్పి దుందుభి
ధ్వానము మ్రోగుచుండ బలవద్రిపుసేనజయించి మించి వి
ద్యానగరాదులందు విజయధ్వజముల్ వెలయించెదీక్షమై. 356

గీ. స్థపతిచంద్రుల మానసాబ్జములఁ బుట్టి
తరలి చనుదెంచి ప్రణవనాదములమధ్య
శిలలపైఁ దాండవమొనర్చె శిల్పలక్ష్మి
యన్నరేంద్రునిభక్తిచే హంపియందు. 357

గీ. ఆ నరేంద్రవతంసునాస్థానమందుఁ
గదలిఁ కళఁబట్టి కాలికిగజ్జెఁగట్టి
పత్రికామాలంకృతానేక భావగతుల
సల్పెఁ దాండవ మాంధ్రభాషాలతాంగి 358

ఆ. అగ్రహారమందె నందలంబులనెక్కి
భద్రగజమునెక్కి పాటఁబాడెఁ
గాంచెఁ బుష్ప, రత్న. కనకాభిషేకముల్
కవికులంబు రాజుకరుణవలన. 359

ఉ. పాకమునారికేళమని పల్కినఁబల్కునుగాక కావ్యమా
లోకనమాచరించుకవిలోక మనర్గళసర్వశబ్ద ధా
రాకమనీయమంచన ధరారమణుండురచించె నాంధ్రశో
భాకరమైనపొత్తము నఖండకళాంచిత విష్ణుచిత్తమున్. 360

సీ. పండించె నేరాజు బ్రహ్మపూజలొనర్చి
యమరాంధ్రసీమ శిల్పములపంట
నందించె నేరాజు హస్తాంజలులముంచి
కవిశేఖరులకు బంగారురజము
కురియించె నేరాజు వరరసోన్మదితుఁడై
ధాత్రిపైఁ గావ్యరత్నాలధార
మెఱయించె నేరాజు కరవాలముధరించి
యాహవంబున రణవ్యూహకళల. 361

గీ. స్థాపనమొనర్చె నేరాజు సకలదిగ్ది
గంతసీమల నిజయశఃకాంతిచయము
నాతఁడే యాంధ్రవాణీపదాబ్జభక్తుఁ
డాంధ్రభోజుఁడు కృష్ణరాయప్రభుండు. 362

ఉ. ఆతనిఖడ్గధారకెరయైరి దురాక్రమణాభిలాషులై
పాతకులెందఱో వివిధభండనరంగములందు నాంధ్ర వి
ఖ్యాతికివన్నెఁగూర్చిన యఖండబలాఢ్యుఁడు కృష్ణరాయ భూ
నేతగదాయటంచు గమనించె సమస్తబుధప్రపంచమ్ముల్. 363

సీ. తన మహాకవితాసుధారాప్రవాహముల్
సాహిత్యకల్పవృక్షములఁ బెనుపఁ
దన మహాకరుణాంబుధారాప్రవాహమ్ము
లాశ్రితానీక సస్యములనేదఁ
దన మహాదానంబు ధారాప్రవాహమ్ము
కవిజనాంగాభిషేకములు సలుపఁ
దన మహాకరవాలధారాప్రవాహమ్ము
లరిశౌర్యదావాగ్ని నార్పివేయ.

గీ. క్షీర, హీర, పటీర, నీహార, పూర,
శారదా, చంద్రికా, దర, శర సమాన
ధవళయశమును దిగ్దిగంతములనిలిపె
నాంధ్రభోజుఁడు కృష్ణరాయప్రభుండు. 364

రాణాప్రతాప సింహుఁడు

ఉ. అందఱవోలె నక్బరునకంది భయంబునవియ్యమంది రా
జ్యేందిరనప్పగించి కడుహీనత జీవితయాత్రసల్ప నా
హైందవకీర్తి మాపనగునా! యని మున్ను ప్రతాపసింహుఁ డె
న్నందగు శౌర్యమూనుచు రణంబునఁదాఁకెఁ దురుష్కసైన్యమున్.

మ. అతఁ డత్యద్భుతశౌర్యరాశి యొకనాఁడా? యొక్కయేఁడా? బలో
ద్ధతితో ముష్కరసేన డీకొని జయధ్వానంబుమిన్నంటఁగా
శతయుద్ధంబులొనర్చి సద్యశము నాచంద్రార్కముగాంచి భా
రతమాతృణముఁదీర్చువీరుఁడుగదా! రాణాప్రతాపుండనన్. 366

ఉ. భండనరంగమందు రిపుబాణముకంటికిఁదాఁకి గ్రుడ్డునన్
గండలురాలినన్ దనువుగాయములన్ నసిచెడ్డ విక్రమో
ద్దండత వైరిసైన్యముబదాబదలైచనఁ బోరు రాజమా
ర్తాండుఁడు శూరశౌండుఁడు ప్రతాపుఁడు హైందవవీరుఁడగ్రజా.

ఉ. కొండొక యుద్ధరంగ మతిఘోరముగా విషమించి యెన్నియో
గండములావరింప గిరిగహ్వరసీమల సేనఁ జేర్చి బ్ర
హ్మాండము దద్దరిల్లఁ బునరాహవమున్ బ్రకటించి వైరులన్
జెండి యశంబుఁగొన్న నృపసింహుఁడు సద్గుణరంహుఁడీతఁడే. 368

చ. ఇరువదివేలసైన్యమున కేమహనీయుఁడొ ? విందుఁగూర్చి యా
దర మొనరించె మెచ్చుచుఁ బ్రతాపనృపున్ బదిరెండువత్సరా
లరమఱలేని డెందమున నాకరుణానిధి దేశభక్తి కం
దళమును శ్రద్ధదోఁపఁగఁ గృతజ్ఞతఁ జూపుట ధర్మమౌఁగదా. 369

ఉ. తమ్ముఁడు తప్పుజేసినను దండన చేసి పవిత్రరాజధ
ర్మమ్ము సముద్ధరించిన ధరారమణుండు ప్రతాపసింహుఁడే
యమ్మ వరాలగర్భమున నామహనీయుని గాంచి పూర్వపు
ణ్యమ్ములు జాలెనో కద! మహాసతులుందురు సర్వభూములన్. 370

ఉ. పట్టినపట్టు వీడక సెబాసన నిర్వదివేలసైన్యమున్
గట్టిగ నిల్పి పైఁబడిన గండములన్నిటి దాఁటి వైరులన్
జుట్టి తెగించి పోరి వెనుచూపక పూర్వపు రాజధానిఁ జే
పట్టినదిట్ట ధర్మపరిపాలకు మెత్తుఁ బ్రతాపసింహునిన్. 371

శివాజీచక్రవర్తి శౌర్యధైర్యములు

ఆ. ఆ తురుష్కనృపుల యనివార్యశౌర్యంబు
బలపరాక్రమములు భారతాంబ
నలమటింపఁ జేయు నపు డుద్భవంబందె
ఛత్రపతి శివాజిచక్రవర్తి 372

మ. సమరక్రీడల నాఱితేరిన శివక్ష్మాపాలమౌళి ప్రతా
పము నొక్కింత వచింతు నీకు గుణదీప్తా! యమ్మహారాష్ట్రసిం
హము శౌర్యాగ్నిఘటచ్ఛటల్ కురియ సంరంభించి గర్జించి యు
ద్ధమునన్ దూఁకె జవంబుఁ బెంచి రిపుమాతంగంబు లల్లాడఁగన్.

ఉ. ఈ నరనాథసింహునిజయింపఁదలంచిన బీజపూరుసు
ల్తాను సమస్తసాంఘిక బలంబునుగోల్పడి జంకికొంకి స
న్మానమొనర్చి యాశివుస్వతంత్రతకుందలయూఁపె నందు న
ట్లైననుజుట్టుపట్టుటయు నందక యుండినఁగాళ్లువట్టుటల్. 374

ఉ. రంగదరాతిభంగచతురంగబలంబులనప్పగించి యౌ
రంగు సెయిస్తఖానునిదురంబునకంపె శివాజిఁబట్ట నా
సంగతి గుర్తెఱింగి నిజసాహసవహ్నులు రేఁగ మత్తమా
తంగముపై హరీంద్రమువిధంబున దూఁకె మరాటసింహమున్. 375

మ. రణరంగంబనినంత హుమ్మనుచు రౌద్రస్ఫూర్తిమై వీరకం
కణమున్దాలిచి ఖడ్గమున్గొని తురంగంబెక్కి రక్తారుణే
క్షణవహ్నుల్చెలరేఁగఁగా విజయదీక్షాదక్షతన్ శత్రుమా
రణహోమంబునుపక్రమించె శివనారాధించి శౌర్యోద్ధతిన్. 376

ఉ. ఘోరరణంబునందెదురుకొన్న తురుష్కులఁజుట్టుముట్టి సం
హారమొనర్చి యందలినిరాయుధులన్ విడనాడి ధూర్తులన్
బాఱఁగఁగొట్టి వ్యూహములబ్రద్దలొనర్చి భయంకరార్భటిన్
సూరతుకొల్లగొట్టి జయిసుందరినందె శివాజినేర్పునన్. 377

వ. తదుపరిజరుగు నయ్యుద్ధమునకు నౌరంజేబుఁ తనకుమారుఁడగు ముఅజ్జమును సేనాధిపతియగు జస్వంతసింహు నంపుటయు వారుపరాజయమందుటయు విని మరలఁ దద్రణాంబున శివాజి బలంబునెఱింగి సంధి యనునెపంబున ఛత్రపతిని ఢిల్లీకిఁబిల్పించి కపటనాటకమాడి బంధింప నపూర్వశక్తియుక్తులతో నతండు తప్పించుకొనివచ్చి 378

గీ. మరలయుద్ధముఁ బ్రకటించి మారణాస్త్ర
సాధనంబుల పెంపుతో సైనికాళి
కోటలన్ గ్రమ్మికొనఁజేసి ఘోరయుద్ధ
మాచరించుచు నౌరంగు నదరఁగొట్టె 379

గీ. రణమునందాఁగలేక యౌరంగజేబు
రాజబిరుదమునొప్పి శివాజితోడ
సంధికొడఁబడి సిగ్గున సైన్యములను
గోటకుంజేర్చికొనె నాఁటిపోటుమాని. 380

శా. ఆనాఁ డాధరణీశునామమొక సింహస్వప్నమైపోయె దు
ష్టానీకద్విరదప్రపంచమున కన్నా! యేకపత్నీవ్రత
స్థానం బాతఁడుపీడఁబోఁడు రిపుకాంతా మోహమున్ బాప నీ
వే నాతల్లివియైన మెత్తునని చెప్పెన్ లోక మాహా! యనన్. 381

గీ. స్వామి ధీమన్మణి సమర్థరామగురుఁడు
ప్రకటితతపఃప్రభావుఁ డార్యప్రియుండు
పావనాత్ముఁడు మన ఛత్రపతిశివాజి
కాత్మబలమిచ్చినట్టి మహామహుండు. 382

శా. జ్ఞానాంభోధి తుకారవాయుజుఁడు సాక్షాద్బ్రహ్మతేజస్వి సం
స్థానాచార్యుఁడు దైవశిల్పముఖవిద్యావేది సంధ్యాద్యను
ష్ఠానాసక్తుఁడు యోగసత్వమయదీక్షాకంకణోద్భాసి బ్ర
హ్మానందుఁడు శివాజి ఛత్రపతి కత్యంతాప్తుఁడై వర్తిలెన్. 383

వ. తుంగభద్రానదివఱకువ్యాపించిన తనరాజ్యమును బదునాలు ప్రాంతములుగ విభజించి మేధావులకధికారములొసంగి యష్టప్రధాన పద్ధతిననుసరించి పరిపాలనము సాగించుచుఁ బరమతసహనంబుఁ దాల్చి గ్రామపంచాయతినెలకొల్పి బీజపూర్ గోల్కొండలంగల చౌత్ సర్దేశిపన్నులయందధికారమంది సుఖంబుగ హైందవరాజ్యలక్ష్మిని నిల్పిపోయె. ఇఁక జహంగీరుకాలమ్మున మనదేశమున కేతెంచిన వారి చరిత్రలవినుము. 384

క. ధనకనకరత్నరాసుల
నసయం బలరారునంచు నాలించికదా
మనదేశముపై నందఱుఁ
గనువేసిరి పూర్వ మన్యఖండనివాసుల్. 385

వాస్కోడిగామా భరతఖండముఁజేరుట

క. దూరంబనికొందఱు నిది
భారంబనికొంద ఱొరుల బాధించుట నా
ఘోరంబనికొందఱు రా
హైరి ప్రయాణంబుసేయ రైరి భయమునన్. 386

చ. మనదేశంబును జేర యోజనలతో మార్గంబుగుర్తించె మున్
వనధిన్ దాఁటుచుఁ బోర్చుగీసుజనుఁడౌ వాస్కోడిగామా యతం,
డన సామాన్యుఁడు కాఁడు వర్తకముచే నాబాలగోపాలమున్
దనవశ్యంబొనరించుకొంటకు విచిత్రప్రజ్ఞనార్జించెడిన్. 387

ఆ. ఆదిఁ గళ్ళికోట కరుదెంచి యందు వ
సించి వర్తకమును బెంచి పెంచి
పిదప బందుగులను బిల్పించికొని కొల్ల
గొట్టసాగె ధనము కోట్లకొలఁది. 388

క. పాపంబు పెరిఁగినటు త
ద్వ్యాపారము పెరిఁగె లాభ మత్యుచ్ఛదశన్
దీపింపసాగె దానిని
గాపాడుట కొక్క కోటఁ గట్టె దృఢముగన్. 389

ఆ. వానికెదురునిల్చి వర్తకంబొనరింపఁ
దదితరులు మతేరుఁ దలఁపరైరి
కారణంబు నరయఁగా నేరెకక్యంబు
గడచిపోయెఁ గొంత కాలమిట్లు. 390

డచ్చివారు పోర్చుగ్రీసువారి వర్తకముతగ్గించుట

వ. అదియట్లుండ ఖండాంతరంబున స్పెయినువారికిఁ బోర్చుగ్రీసువారికి గలహంబుసంభవించుటయు నందు స్పెయినువారుగెల్చుటయుఁ దత్కారణంబున జంకక డచ్చివారిం దరుదెంచి వ్యాపారంబు సాగించిరి. 391

గీ. మచ్చరముఁబూని చెచ్చెర డచ్చివారు
తరిమి రా పోర్చుగ్రీసువర్తకులనెల్ల
దైవబల మంతరించినఁ దక్షణంబ
తాఱుమాఱగు నెవ్వానిదశలుగాని. 392

వ. ఇట్లభివృద్ధినందుచు నత్యధికధనార్జనఁ జేయుచు. 393

చ. అతులితశౌర్యమూని యెవరడ్డమువత్తురుమాకు వచ్చినం
బ్రతుకరు మాబలం బన నపార మజేయమటంచు నెంచి గ
ర్వితమతులై సతంబువిహరింపఁ దొడంగిరి ముందువచ్చు దు
ర్గతులగ్రహింపఁజాల రవురా! మదబంధితులైనమానవుల్. 394

ఉ. ఎవ్వరుగూడస్వార్థపరులే మనసంపదఁగొల్లకొట్టఁగా
నివ్వసుధాతలంబు నలయింతురు వారికివారికేల యీ
చివ్వలు లేనిపోనినిరసింపులు తత్కథలన్ దలంచుచో
న వ్వుదయించుచుండు సుజనంబులకెప్పుడు మిత్రరత్నమా. 395

ఉ. ఆయెడ డచ్చివారి నౌకయాహవరంగమునందెదిర్చి యాం
గ్లేయులుఫ్రెంచివారు దలక్రిందొనరించిననాఁటినుండి యాం
గ్లేయులు డచ్చివారి నదలించి చలింపక వర్తకంబులన్
జేయుట కీ ధరాస్థలముఁజేరిరి వారధిదాఁటి దీక్షమై. 396

ఆ. వచ్చి వారు పెంచు వర్తకమహిమచే
డస్సె డచ్చివారి డాంబికంబు
త్రాటి నెక్కు వాని తలఁదన్ను వాఁడొకఁ
డుండునన్న సామ్య మొప్పుఁగాదె. 397

అంగ్లేయులకు ఫ్రెంచివారికిఁ గలహము

చ. అది మొదలాంగ్లవర్తకుల కత్యధికార్థముచిక్కె సర్వసం
పదలొడఁగూడెఁ బల్లియలుఁ బత్తనముల్ సహకారమిచ్చె నం
చెదలఁదలంచి సర్వము గ్రహించి దురాశవహించి వెంటనే
కదలిరి ఫ్రెంచివర్తకు లఖండకళాకలితుల్ కుయుక్తితో. 398

క. ఇరు తెగలవార లొకరొ
క్కరిమించఁగ బేరమాడఁగల్గిరి యార్జిం
చిరి కోట్లకొలఁది ధనముం
బురముల రత్నములఁ గొన్ని భూభాగములన్. 399

వ. ఇట్లు కొంత కాలంబు చన్న పిదప ఐరోపాఖండమున నింగ్లీషువారి
కిని ఫ్రెంచివారికిని రణంబుసాగెఁగాన నిచటనున్న యారెండు తెగ
లవారికి నపుడు పోరేర్పడె. 400

చ. అదియ మొహమ్మదీయులకు హైందవకోటికి మధ్య వైరముల్
కదలి భయంకరంబయిన కాలము, రాజులు రాజు లుద్ధతిన్
గదన మొనర్పం దీక్షఁగొను కాలము, బంధు విరోధజాలముల్
గదుముచు వెన్నుపైఁ బొడుచు కాలము వైరుల చేతిగాలముల్. 401

గీ. సమరమందు విరోధిని సంహరింప
నాంగ్ల సేనల నొక్క రాజాశ్రయించు
నది గ్రహించి విరోధి రాజాశ్రయించు
ఫ్రెంచి సైన్యాధిపతులఁ బూజించి మిగుల. 402

ఆ. ఎవ్వరెవరిపట్ల నేతెంచినను గాని
సత్యమునకు వారు స్వార్థపరులు
లంచమీయకున్న మంచాలనెక్కని
వారి తెగకుఁజెందు వారు వారు. 403

గీ. భారతప్రాంతములఁ బాడు పాడొనర్చు
నాంతరంగిక కలహమ్ము లాహవములు
నన్య దేశీయులకు మహాహ్లాదమిచ్చు
కమ్మకమ్మని కల్ప వృక్షమ్ములయ్యె. 404

వ. అట్లు యుద్ధమ్ములయందు సాహాయ్యంబొనర్చుచుఁ గట్నంబు లను పేరఁగొన్ని భూభాగంబుల హరించుచుండిరి. తుదకు ఫ్రెంచివారికి నాంగ్లేయులకు వైరంబధికమయ్యె. 405

ఉ. పంతమనంతమై యుభయపక్షములన్ జెలఁరేగ జెప్పరా
నంతవిరోధముల్ పెరిఁగె నాహవముల్ సమకూరె జంకు ర
వ్వంతయులేక పోరిరి దురాగ్రహముల్ ధరియించి శాంతి కిం
తంతయుఁదావొసంగక తదాంగ్లవణిక్ప్రముఖుల్ పరాసులున్. 406

క. వారలలో వారలకటు
వైరంబులు పెరిఁగికోపవహ్నులు రేఁగఁ
బోరేర్పడె నందోడిన
వారైయవమతినిబుల్లవడిరి పరాసుల్. 407

గీ. ఆ పరాభవదావాగ్ని కాఁగలేక
తమపురంబులనెల్ల భద్రములఁజేసి
తరలిపోయిరి ఫ్రెంచివర్తకులు నాఁడు
విధివిలాసము నెవరు తప్పింపఁగలరు. 408

ఈస్టిండియాకంపెనీవారు

వ. అంతట నాంగ్లేయులు మనదేశమున. 409

క. మాయోపాయంబులతో
నాయారాజ్యములఁజొచ్చి యట వేరంబుం
జేయఁదొడంగిరి తుద కవి
మాయవి యనిరకట ! ప్రజ లమాయికులగుటన్. 410

గీ. తండ్రికొడుకులలో విరోధములఁబెంచి
యన్నదమ్ములు కలహమ్ములాడఁజేసి
తీర్పుచెప్పిరి మధ్యవర్తిత్వమూని
నడుమ మార్జాలమర్కటన్యాయ్యమునను. 411

క. ఆ రోజులలలోనేకద
వారన్ హేస్టింగు తొలిగవర్నరు హింసన్
గూరిచి స్వార్థపరుండై
భారతదేశమును దుఃఖవారిధిముంచెన్. 412

ఉ. మా నియమాలదాఁటి రనుమాటలతో జనరక్షణంబులన్
మానిరటన్నసాకుగలమాయలతో నిజదత్తముఖ్యసం
తానముఁగానరన్నవచనంబులతో నదలించి కొన్నిసం
స్థానములాక్రమించిరి స్వసైన్యబలంబునుజూపి వర్తకుల్. 413

చ. సమయము గుర్తెఱింగి యొకసంధికొడంబడుచుంట స్వీయకా
ర్యమునెఱవేరినంతన నిరాదరణంబునుజూపుచుంట భం
గమునకుదారిఁదీయుట మొగంబులఁజూడకపల్కుచుంట త
త్కుమతులవృత్తి ధర్మమునకున్ దలలొగ్గరు స్వార్థతత్పరుల్.

క. తమసైన్యంబుల సంస్థా
నములన్ గీల్కొల్పి యనుదినముఁ దగునాహా
రము సమకూర్పుండని నియ
మములన్ నెలకొల్పి రవి యమానుషచర్యల్. 415

లండన్‌ప్రభుత్వవిచారణ

క. వ్యాపారు లిచట రాజ్య
స్థాపనమొనరించి రన్నసడిఁగని లండన్
భూపాలకవర్గం బతి
కోపంబువహించి పండ్లుగొఱుకుచు నుండెన్. 416

క. వారంపు సనదులం గొని
మీరము మీయాజ్ఞ ననుచు మేమును మీ వ్యా
పారులమని వినయంబుగ
భారతఖండమునసిల్పి పల్కిరి వణిజుల్. 417

వ. అక్కాలంబున వారన్‌హేస్టింగుదౌర్జన్యంబుల విచారించి ప్రభుత్వమువారు వానిచేఁ దప్పునొప్పించిరి కాని లాభమేమి వానిని శిక్షింపరైరి. 418

చ. అలుకవహించి పైఁబడి దురాక్రమణంబొనరించుచుంట తత్
స్థలములనెల్ల నుబ్బుచుఁబతాకలనెత్తుట సైన్యజాలమున్
నిలిపి యమాయికప్రజ ననేకవిధంబులవంచుచుంట కా
వలయును నిత్యమున్ ధవళవర్తక సాంఘిక సభ్యకోటికిన్. 419

మ. క్రమమొప్పారవసించుచుండెనని యా కాశీపురాది ప్రదే
శములంగల్గినకర్షకావళికి నష్టంబెంతయోగూర్పఁగాఁ
గమతంబుల్‌తొలఁగించి దాస్యతమమున్‌గల్పించి రా వర్తక
ప్రముఖుల్ స్వార్థపరాయణుల్ సుగుణదీపా! ధర్మమేమయ్యెనో.

చ. పనిఁగొని సైన్యమందుఁగల భారతవీరులకెల్ల నల్పవే
తనములనిచ్చుచుంట తమదాసులవోలె నిరంతరంబుఁ X
న్గొనుట సమస్తమాన్యతలఁగూల్చుట తూల్చుట లేనిపోని పె
త్తనముఁలదాల్చి బెత్తముల నందుట యాంగ్లులనిత్యకృత్యముల్.

గీ. హైందవధరాధిపతుల సింహాసనములు
ధీరులగు ఫాదుషాల బల్ దేవిడీలు
నాంగిలేయులక్రూరకృత్యముల చేతఁ
దొలఁగిపోయిన వేమంచుఁదెలుపువాఁడ. 422

ఆ. బయటికీడ్చి పట్టిబాధించి యేడ్చెడి
శీలవతుల సిగ్గుఁజెఱచిరకట
యువకులెంద ఱప్పు డురిశిక్షులందిరో
తెలుపనలవికాదు ధీవిశాల. 423

వ. మఱియు భారతీయులకు మొహమ్మదీయులకట కనిష్టంబులగు గో
సూకరమాంసమిళితములగు తూటాల వారినోళ్ళతోఁ బగులు
దీయించుటయు నధికారులఁబురికొల్పి యక్రమముగఁ బన్నుల
నేకరించుటయు నెదురాడినవారలఁ జిత్రహింసల పాలుసేయుటయు
స్త్రీల నవమానపఱచుటయు జరుగుచుండె. 424

క. వలలోపలఁజిక్కిన చే
పలవలెఁ బుత్రకులు పరులబంధనముల సి
ల్గులుపడుటగాంచి కన్నుల
జలములరాల్చినది దేశజనయిత్రి ? కటా. 425

గీ. భారతసవిత్రి పుణ్యగర్భమునఁబుట్టి
బలపరాక్రమములయందు బ్రథితిగాంచు
వీరులకు నాఁడు దాస్యాంధకారమలమె
విధివిధానము నెవరు తప్పింపఁగలరు. 426

గీ. లార్డుక్లైవు పాలించుకాలమ్మునుండి
నడుమ డల్ హౌసికాలంబు గడచువఱకు
నాంగ్లవణిజు లొనర్చు నన్యాయ్యములకు
నంతులేదవి వర్ణింపనలవికావు. 427

## ప్లాసీయుద్ధము

క. మొదటనెదిరించెఁ బ్లాసీ
కదనంబున సేననిల్పి ఖడ్గధరుండై
పొదలి సురాజద్దౌలా
మదిజంకక క్లైవుదొరను మార్కొనిదీక్షన్. 428

వ. అంతకుముందు స్వామిద్రోహియు నతని సైన్యాధిపతియు నగు ముజ
ఫర్ ఖాఁ నను దుర్మార్గుఁడు రహస్యముగ శత్రువర్గంబునఁ జేరి మహా
యుద్ధసమయమున సేనలఁ దొలఁగించికొని యదృశ్యుండయ్యె. 429

క. పరులకువశుఁడై మీర్జా
ఫరు తొలఁగినకతన నాఁటిబవరంబున గె
ల్చిరియాంగ్లులు హితులై యా
యిరువురు పోరాడుచో జయింతురె చెపుమా. 430

వ. అయ్యది పదునేడువందలయేఁబదియేడవవత్సరమున జరుగుటయు
నం దాంగ్లులు గెలుచుటయుఁ బిదప దేశంబున. 431

ఉ. హాయితొలంగిచన్నయది యాపదలెక్కువయయ్యె భారత
స్థాయినశించె ధూర్తజనదారుణకృత్యములై లగ్గలంబు
పోయె జనంబులెల్లఁ బగఁ బూనిరి యెప్పుడొ శౌర్యమూని యాం
గ్లేయులఁ బారఁ ద్రోలఁ బరికించుచునుండిరి క్రుద్ధచిత్తులై, 432

క. హైందవులు మొహదీయులు
నం దేకపవధాలంబులైరి జయంబున్
గందుమను భ్రమలఁ బొందిరి
ముం దడుగిడసాఁగి రొక్కముఖముగ దీక్షన్. 433

రహస్యవిప్లవ సందేశము

ఉ. ఆశ జనించునట్లు జనులందఱకున్ భరియింపరాని యా
వేశముపొంగునట్లు పటు విప్లవపూరితమౌ రహస్యసం
దేశమునందఁజేసిరి యిదే కడసారిప్రయత్నమంచు మీ
దేశమునందికొండు వెనుదీయకుఁడంచు గభీరవాక్కులన్. 434

ఉ. పౌరుషరేఖలన్ వఱలు భారతధారణినుద్భవించి యా
ఘోరపరాభవాగ్నిఁబడి కుందఁగనేటికి లెందురం డహో
వీరవరేణ్యులార యిఁకవిప్లవయాత్రకు ధైర్యలక్ష్మితోఁ
బేరుఁబ్రతిష్ఠనందుఁ డరిభీకరులై జయభేరిమ్రోఁగఁగన్. 435

చ. రవరవలాడు మీతరుణరక్తము నీరయిపోయెనే ? సదా
కవకవలాడఁగాఁ బిఱికికండలు పెంచితిరో కొ శౌర్యమే
లవ మయిపోయెనా నరములన్ జవసత్వము లంతరించెనా ?
యువజనులార! సిగ్గుచెడియుంటిరె ? వైరులక్రింద దేబెలై. 436

గీ. మానవతులైన మిమ్మవమానపఱచి
యెంతహింసించిరో శత్రులెఱుఁగరొకొ
సాయమిడుఁడమ్మ! విప్లవసమరమందుఁ
దల్లులార! మహోదయావల్లులార! 437

వ. మఱియు 438

సీ. వర్తకులార! మీవ్యాపారములనెల్లఁ
బాడుచేసినవారిఁ బాఱఁగొట్టఁ
గర్షకులార! మీకాయకష్టమునెల్లఁ
దోలఁగఁదీసెడివారిఁ ద్రోసివేయఁ
గార్మికులార! మీగౌరవశ్రీనెల్లఁ
గాలరాచినవారిఁ గూలనెట్ట
ధనవంతులార! మీతలలువంగువిధానఁ
బన్నఁబెంచినవారి వెన్నుపొడువ

గీ. రాజవరులార! మిమ్ముఁ బరాభవించి
కులుకుచుండిన పగవారిఁ గ్రుంగఁదీయ
సమయ మరుదెంచె మాకు మీ సాయమిచ్చి
విప్లవరణంబునకుఁ దోడు వెడలిరండు. 439

ఉ. కమలమునంపుచుంటి మది గైకొని వాసనచూడుఁడయ్య! యీ
సమరమునందుఁబాలుగొన సమ్మతిఁజూపినయట్లు దోఁచు నా
కమలముతోడవచ్చు నొక కమ్మనిఱొట్టియు కొద్దికొద్దిగా
నమలుఁడు సోదరైక్యము ఘనంబుగఁ జాటినయట్లు తన్పడున్.

గీ. అని రహస్యముగాఁబంప నందఱట్లు
సేయఁదొడఁగిరి విప్లవ(శ్రీ)వెలుంగు
సమయమున నాఁటిభారతసైనికులకుఁ
గబురుఁబంపిరి గుప్తంబుగాఁగ నిశను. 441

సిపాయికలహము

క. పదునెనిమిదివందలయేఁ
బదియేఁడవవత్సరమునఁ బఱగెడి మే ము
ప్పదియవదినమున విప్లవ
ముదయించెను బద్మబాంధవోదయవేళన్. 442

గీ. మహికి దివికంట దశదిశల్ మాఱుమ్రోఁగ
దడిసి ధారాధరంబులు దద్దరిల్ల
శత్రువులగుండెలల్లాడ సకలభరత
ధరణిఁ జెలరేఁగె విప్లవధ్వానమొకటి. 443

ఉ. భారతరాజ్యలక్ష్మి యొకబానిసయై పలుబాములంది క
న్నీరువెలార్చుచుంట గమనించినవీరులు వీరకామినుల్
ఘోరరణంబునందు రిపుకోటినెదుర్కొని నిర్భయమ్ముగన్
బోరిరిదీక్ష నాచరితముల్ వివరించెద నాలకింపుమా. 444

చ. రణకళఁజూపి భారతధరాగరిమమ్ముననిల్ప వీరకం
కణములఁదాల్చి శాతసితఖడ్గములన్ధరియించి దీక్ష వీ
క్షణములవైరివీరులదెసన్ గురియించుచు దూఁకిరప్సరో
గణము లదృశ్యరూపములఁగాంచి ముదంబువహింప నయ్యెడన్.

చ. పరనృపపాలనంబుననఁపం బనిఁబూని పవిత్రభారత
స్థిరతరశౌర్యధీతులఁజిమ్ముచు సాహసవిక్రమార్కులై
నఱకిరి శత్రువీరుల రణంబున విప్లవదండయాత్రలన్
జరపిరి యాంగ్లసైనికులు సంగరరంగము వీడిపాఱఁగన్. 446

క. ఆనాఁటి కవాతున, మన
సేనానివహంబు వారిసేనయు భయద
ధ్వానములు రేఁగఁబోరిరి
మానప్రాణములు సరిసమానము లనుచున్. 447

ఉ. మీరటుదుర్గమందు మితిమీఱినశౌర్యదవాగ్ని రేఁగఁగా
భారతసైనికుల్ తిరుగుఁబాటొనరించి విదేశవీరసం
హారమొనర్చి హస్తిపురినాక్రమణంబొనరించి భీకరా
కారములొప్పఁ గోటనరికట్టిరి కొట్టిరి నెట్టి రాంగ్లులన్. 448

శా. ఆనాఁడేపురికొల్పిసైన్యముల శౌర్యజ్వాలతోఁగానుపూర్
స్థానంబం దెదిరించె శత్రువులఁబీష్వాబాజి సత్పుత్రుఁ డా
నానాసాహెబు వీరసింహమన నన్నా! చీల్చిచెండాడె దీ
తూనైశిత్యముఁదాల్చి భారతజయస్తంభంబునెత్తింపఁగన్. 449

గీ. అపుడె ? లక్ష్మీసిఫాయీ లనంతశౌర్య
ధైర్యములఁబెంచి రిపుబలోద్ధతినడంచి
రా సమయమంద దేశమందన్నిదిశల
విప్లవజ్వాలలెగసి విస్ఫీధినంటె. 450

ఉ. మేటిఫిరంగులన్నియు నిమేషములో మటుమాయమయ్యె పో
రాటము మించిపోయె విజయస్వనముల్ మిను ముట్టుచుండె నా
ధాటికి వైరికోటలు బదాబదలై పడిపోయె భీతిచేఁ
జాటుమఱుంగులన్ నిలువసాగిరి యాంగ్లవణిక్చమూపతుల్. 451

ఝాన్సిలక్ష్మి శౌర్యసాహసములు

ఉ. భారతవీరవిప్లవమపారముగాఁ బయనించి శత్రుసం
హారమొనర్ప మారణమహారణహోమముఁ జేయు నాఁటి స
త్పౌరుషగాథలోఁ బ్రముఖపాత్రధరించిన ఝాన్సిలక్ష్మి దో
స్సార మనంత మవ్యయ మసాధ్య మభేద్యము మిత్రసత్తమా.

ఉ. ఆయుధముల్ ధరించి ధవళాశ్వము నెక్కి శరీరమున్ దృణ
ప్రాయముగాఁ దలంచి తనభారతశౌర్యనిరూపకక్రియా
ప్యాయముకోరి ఖడ్గరణపాండితిఁ జూపి యశఃప్రభన్ జిర
స్థాయిగ నిల్పు వీరవనితామణి యాయమ నెన్నశక్యమే ? 453

చ. ఇరువదిమూఁడు వత్సరములే ? మనఝాన్సికిఁ బ్రాయమింతగాఁ
పరిమితమైననేమి నవపౌరుషరక్తము పొంగిపాఱ సం
గరమున దూఁకి శత్రుజనకాండము నుక్కడగించి భారత
స్థిరతరశక్తిఁ జూపిన సతీమణి యామెగదా నిజంబుగన్. 454

చ. తడఁబడఁబోక ధూర్తజనధాటి నెదుర్కొను వీరకృత్యముల్
చెడుగుడుకులాట లాభయదసింహకుమారికి వైరిగుండియల్
దడదడలాడు నామె దరిదాపులకేఁగఁ దదీయశక్తియా ?
యొడిసెలజాతిదెబ్బ యననొప్పును వైరియు మెచ్చు దత్సతిన్. 455

వ. అవ్వీరకాంత. 456

చ. బ్రతికినయంతకాలమును బాలనచేసె స్వకీయరాజ్యముం
బతివలె ధర్మమార్గమును బాయదుఁ స్వార్థపరుల్ ప్రభుత్వముం
బతనమొనర్పఁ గుట్రఁగొనుపట్ల బలోద్ధతిఁ జూపి వైరులన్
హతులనొనర్చెఁ జాలును జయాపజయంబులు దైవచిత్తముల్. 457

వ. మఱియుఁ గుంవరసింహాదివీరులును దాంతియాతోపీ ప్రముఖులును నాటివిప్లవంబునఁ బ్రముఖపాత్రములవహించి సైన్యాధిపతులైయాంగ్ల సైన్యంబుల గడగడలాడించిరి యమ్మహాభయంకరవిప్లవమ్మున నిరు తెగలవీరులు మడిసిరి. 458

విప్లవాపజయము, తత్కారణములు

క. ఆ తిరుగుబాటునందు వి
ఘాతములెన్నెన్నొ జరుగుకతనఁ దుదిదశన్
లాఁతులు గెల్చిరి భారత
జాతికిఁ దలవంపులును విషాదముఁ గలిగెన్. 459

క. కారణములఁ దెల్పెద మన
భూరమణులు మొదటలొంగిపోయిరి యాంగ్లే
యారాధనఁబడి విప్లవ
మారంభించుటకుఁ బూర్వ మతిభయవశులై. 460

క. క్రిమియాయుద్ధము చైనా
సమరం బాఁగుటయు నచటిసైన్యము మనపై
దుముకుటయుఁ గారణములై
సమసెను విప్లవము దేశసైన్యముచెదరన్. 461

గీ. తంతివార్తాదిసౌకర్యతతులు మనకు
లభ్యములుగామి నౌకాబలంబు వారి
కధికముగనుంట నీలుసైన్యములు సమయ
మునకు నంపుట విప్లవమ్మునకు దెబ్బ. 462

ఆ. అస్వతంత్రులగుచు నాంగ్లేయవరులచే
బానిసలుగ నిల్పఁబడినవారు
మంత్రులగుట వారు మానభిమానముల్
విడిచియుంటఁ జెడియె విప్లవంబు. 463

వ. మఱియు ధనికు లిందుఁబాల్గొనకుంటయు నందందుఁగల కొందఱు సిపాయీలు తటస్థులైనిల్చుటయు మారణాస్త్రంబులు కొఱఁతపడుటయు నాహారాదిసౌకర్యంబులుతఱుగుటయు నింగ్లాండుసైన్యంబులు లక్షలాదిగ దిగుటయుఁగారణంబులై విప్లవంబడుగంటె. 464

ఆ. నీలుసైన్యమిచట నిల్చి దుందుడుకొప్పఁ
జేసినట్టి నాఁటిచిత్రవధలు
తలఁచికొన్న మనసుదగ్ధమైపోవును
నేఁటివఱకుఁగూడ నిక్కువముగ. 465

వ. ఆ దళమునందలి మొనగాండ్రు 466

క. నమ్మించి విందుకొఱకై
రమ్మని యొకచోటఁజేర్చి రాపాడుచుఁ బ్రా
ణమ్ములఁదీసిరి మనసై
న్యమ్మునఁగల నాయకులు నిరాయుధులఁ గటా. 467

ఉ. కొందఱగుప్తమార్గములఁ గొందఱఁజీఁకటికొట్లలోపలన్
గొందఱసందుగొందులను గొందఱఘోరవనాంతరంబులన్
గొందఱగుట్టలందు మఱికొందఱవీధులయందు ధూర్తులై
మ్రందఁగఁజేసి రెంతటియమానుషకృత్యములో గ్రహింపుమా.

ఆ. స్త్రీలఁజెఱచి తరుణసింహుల నురిదీసి
వీరవరులఁ జెట్ల వ్రేలఁగట్టి
చిత్రచిత్రవధలఁ జేసిరి తత్కథల్
తలఁచినంత గుండె తల్లడిల్లు. 469

ఉ. అంతిమవేళఁ గల్గెడి జయాపజయాంబుల కేమిగాని ర
వ్వంతయు జంకఁబోవరు మహాహవసీమల భారతీయు ల
త్యంతపరాక్రమాఢ్యులు దురాక్రమణంబున కోర్వ రన్న సి
ద్ధాంతము వైరివీరుల హృదంతరవీథులఁ దోఁచె నయ్యెడన్. 470

గీ. పోరి రోకదేశ స్వాతంత్ర్యమును హరింపఁ
బూని రోకదేశ స్వాతంత్ర్యమును హరింప
ధర్మ మెవ్వరిదో విబుధప్రవరులు
తరతరంబులదాఁక గుర్తెఱుఁగఁగలరు. 471

శ్రీ విక్టోరియారాణి - భారతపట్టాభిషేకము

గీ. ఎలిజబెతురాణి యనుమతి నిటకువచ్చి
సాహుకార్జించుకొన్న రాచఱిక మెల్ల
నదరి విక్టోరియారాణి కగ్గపడియె
భారతీయులనాఁటి విప్లవముచేత. 472

గీ. ఆమె పట్టముఁగట్టికొన్నప్డు డలహా
బాదుపురమున జరుగు దర్బారునందు
భారతీయులకొఱకొక్క ప్రకటనంబుఁ
జేసె శాంతిని మివులఁ గాంక్షించి యిట్లు. 473

గీ. భారతప్రజలార! మాపక్షమందె
వర్తకులపాలన మొనర్చు వసుధ యెల్ల
భావి మా చేతఁ బాలింపఁబడును గాన
నహుచుకొనఁదగు నింక నే నుడివినట్లు. 474

క. మీరందఱు నన్నును నా
వారసులను భక్తిగౌరవమ్ములఁ జూడం
గోరెద నేనిల్పినయధి
కారుల నియమముల దాఁటఁగా రాదు సుహా. 475

వ. తొల్లి సంస్థానాధీశ్వరులకు జరిగిన యొడంబడికల మన్నించెద నిఁక ముందు రాజ్యంబును బెంపక రాజులగౌరవించెద. 476

క. కులమతభేదంబుల మదిఁ
దలఁపక జాతులనఁబోక తత్తద్విద్యా
బలములఁగని యుద్యోగం
బులనొసఁగెదఁ గరుణఁదాల్చి ప్రోచెదమిమ్మున్. 477

క. మీ వంశాచారంబుల
నేవిధముననైనఁ జెఱుపనెంచను మతదీ
క్షావరిష్ఠుల హేళన
గావింపను నాకు నదియ కావలయుఁగదా. 478

గీ. హంతలగువారిశిక్షింతు నచటనచట
విప్లవమ్ములుసాగించు వీరవరులఁ
దప్పకక్షమింతు దండయాత్రలకు దిగిన
వారిదండింతు ధర్మంబువలయు మనకు. 479

వ. ప్రథమరాజప్రతినిధిగ చార్లెస్ జాన్ వైకౌంట్ కానింగును బంపుచుంటి నతండు మదీయాజ్ఞానువర్తియై మిమ్ముఁబాలించు వివిధ న్యాయస్థానాధికారులును తదితరులు నిఁకముందు నాయాజ్ఞల మెలఁగఁదగు మాప్రజలవలె మిమ్ములను బాలింపఁదలఁతు శాంతి చేకూఱినయనంతరము భారతపరిశ్రమల నభివృద్ధిపఱతు నన్యమత వైరుధ్యంబుఁజూప హృదయపూర్వకముగ మీ యభివృద్ధిఁగోరెద, నదియ మామేలని తలంచెద, నిదినిక్కమని వివరించి యారాణి భారతదేశంబును బాలించుచుండె. 480

———

# నవ భారతము

## సభాపర్వము



శ్రీరాజితలక్షణావి
స్తారా! భారతకుమార! సాత్త్వికపథ సం
చారా! వినుమర్థిన్ నవ
భారతకావ్యమునఁగల సభాపర్వంబున్. 1

క. వెతలం బడిపడి మన భా
రతఖండం బంత బ్రిటనురాణికి వశమై
న తెఱంగెఱింగితివిగద
గతపర్వమునందు; మీఁది కథ నిఁక వినుతున్. 2

గీ. నాఁటి విక్టోరియాపాలనంబునందుఁ
జెప్పికొనఁదగుమార్పు వచ్చినదికాదు
కాని హాయిగఁ గాలంబుగడచిపోయె
నిరువదేఁడులు రణభయం బింతలేక. 3

రాజప్రతినిధుల పాలనములు

క. రాజప్రతినిధులఁట గుణ
రాజితులఁట యప్పుడపుడు రాసాగిరి నీ
రాజనము లందికొని మన
తేజమ్ములనెల్ల గ్రుంగఁదీయుటకొఱకై. 4

క. ఆ యమ్మ చెప్పినదియే
మో? యెవరెఱుఁగుదురు సాత్త్వికోక్తులు మాయో
పాయమ్ములు వైస్త్రాయుల
కాయుధములు నాఁడు యువజనాగ్రణి! వినుమా. 5

క. ఆదాయాదులపైఁ బ్రతి
పాదించిరి పన్నులెన్నొ ప్రజలకు హృదయా
వేదనలు గలుగఁ దమ సం
పాదన పెరుఁగంగ నాఁటిపాలకు లకటా. 6

క. ఎగుమతులన్ దిగుమతులన్
దెగఁబడి సుంకమ్ములనువిధించిరి విజ్ఞుల్
నగుదురని సుంతతలఁపక
వగలాడిగవర్నరుల్ యువమణీ! వినుమా. 7

ఆ. చీలఁదీసి ప్రజలఁ బాలించు విద్యలో
నాఱితేరినట్టివారు వారు
భరతఖండమందుఁ బాఱె నమ్మంత్రము
కుల మతాదు లింపు బలిసియుంట. 8

వ. ఆ యాంగ్లేయప్రభువులు. 9

గీ. ఎంతకష్టించిచదివిన నేమిఫలము
భారతీయుల కున్నతపదవులీయ
రెంత ప్రభుభక్తిఁజూపిన నేమిఫలము
భారతీయుల గౌరవింపంగఁబోరు. 10

రాణి వాగ్దానభంగములు

క. ఆనాఁడు రాణి మన క
త్యానందముకల్గునట్టు లాడినమాటల్
మేనులు పొంగఁగ నిడు వా
గ్దానమ్ములు చూచుచుండఁదార్మాఱాయెన్. 11

క. పొలములపై జలములపైఁ
గలుములపైఁ బెత్తనంబుఁగైకొని ప్రభువుల్
విలువలకుమించు పన్నుల
నిలిపిరి సాధించికొనుటనేర్చిరి వేడ్కన్. 12

క. మనకోటల మనపేటల
మనమాటలఁ బట్టిబట్టి మాటలతోఁ గై
కొనసాగిరకట! విత్తా
ర్జనపరులను మంచిచెడు విచారములున్నే. 13

క. మనదేశంబున వెలువడు
ఖనిజంబులఁ గనకరత్నగణములనెల్లన్
గొనిపోఁగడఁగిరి ఘనసా
ధనములతో మెఱయు నవవిధానంబులతో. 14

వ. వారు చతుర్విధస్వాతంత్ర్యములపహరించుచుఁ గఠినశాసనంబుల నెఱ
కొల్పుచుఁ బాలింపఁదొడఁగిరి. యింతకుము న్నాదొరలు. 15

సీ. అన్యోన్యసహకార మభిలషించెదమన్న
పలుకు లాకాశపుష్పమ్ములయ్యెఁ
బరమతంబులజోలి కరుగబోమని పాడు
పాటలన్నియు నేలపాటులయ్యె
నన్యజాతీయత నణఁపబోమని చెప్పు
మాటలన్నియు నీటిమూటలయ్యె
నాహ్లాదమొడఁగూర్తుమని చేయువాగ్దా
నములెల్ల శశవిషాణమ్ములయ్యె

గీ. భారతాభ్యుదయంబ మాభాగ్యమంచుఁ
బలుకుపలుకులు కలఁదోఁచు కులుకులయ్యె
మర్మములునిల్చె సత్యధర్మములు క్రుంగె
నకట! యానాఁటి యాంగ్లపాలకులయందు. 16

సీ. ధనమానరక్షణార్థంబె యైనను గాని
యందనీయరుగదా ! యాయుధములఁ
బాఁడిపంటలనిచ్చు పశులమేపుటకైనఁ
దిరుగనీయరుగదా గిరులదరులఁ
గష్టనష్టముల వక్కాణించికొననైనఁ
జనవునీయరుగదా సముఖమందు
సంస్కరణక్రియాచర్చలకైనను
జరుగనీయరుగదా సంఘసభలఁ

గీ. పాశములవోలె శాసనప్రతతిగూర్చి
కంఠములకుబిగించి పైఁ గట్టిబూని
పాలనము చేసిరాంగ్లభూపాలవరులు
భారతప్రజ నేమంచుఁ బలుకువాఁడ. 17

క. ఉపకారముఁ జేసెద మను
నెపమున ద్రవ్యంబు లాగనేర్చిరి యాయా
యుపకారంబులలోపల
నపకారం బిమిడియుండు నాలోచింపన్. 18

వ. మఱియు. 19

క. ఏ శాఖలలోఁ జూచిన
నాశలు పొడగట్టఁబోవ వన్నింటను మా
యాశాసనములుమాత్రము
పాశములై కానిపించుఁ బ్రజ నుగ్గాడన్. 20

క. ఒకతఱిఁ గర్షకులను వే
ఱొకసమయంబందుఁ గార్మికోత్కరమును నిం
కొకతరుణమందు వణిజులఁ
దికమకలొనరించి క్రుంగఁదీసెదరు దొరల్. 21

క. తనధనముఁ దనబలంబును
దనకనకముఁ దనపశస్సుధాధారల నం
దను లనుభవింపకుండుటఁ
గని భారతమాత యెంతకలవరపడెనో. 22

వ. అది యట్లుండె నింక సాంఘికోపద్రవంబులఁగూర్చి వివరింతు నాకర్ణింపుము. 23

సాంఘిక దుష్టాచారములు

క. నడుమంత్రపు టాచారము
లడుగడుగున నిల్చిపొల్చి యడ్డములై పైఁ
బడి ప్రజలచెలిమినెల్లన్
జెడఁగొట్టెన్ బలముఁగొని యిసీ! పడఁగొట్టెన్. 24

చ. కులమతవర్గవాదములకుం గుఱియయ్యె జనంబు కావునం
గలహము లుద్భవించెఁ గడగండ్లుజనించె నమాయికప్రజన్
వెలుపలనుంచుచట్టములు వేలుదయించెఁ బవిత్రభారత
స్థలమపవిత్రచిహ్నములఁదాల్చెఁ గుబుద్ధుల తంత్రనైపుణిన్. 25

వ. మఱియు నొక్కయెడ ధర్మం బధర్మంబగుటయు వేఱొకయెడ నధర్మంబు ధర్మంబగుటయు దురాచారంబు లనేకవిధంబుల వ్యాపించుటయుజరిగె. 26

క. అల్లాడుచుండెఁ దనగృహ
కల్లోలంబులనుజూచి కడుడస్సి దయా
వల్లరి భారతి, యాపైఁ
దెల్లదొరలదుండగములు దిగులుంబెంచెన్. 27

గీ. కలిమిలేములఁ గష్టసుఖములు నిలువఁ
జాలునే! శుక్లకృష్ణపక్షంబులట్లు
మాఱుచుండుట సహజంబు మానవాళి
యోపికవహించుచో మేలునొందఁగలదు. 28

## భారత వైతాళికులు

వ. దాస్యాంధకారంబునంబడి తపించుచు మూఢాచారంబులఁ జిక్కి-
పలుతెఱంగులవిచ్చలవిడిసంచరించు సంతానంబునుగాంచి తహతహ
లాడుచుదిక్కుగానకభారతసవిత్రిక్రుంగికృశించునాసమయంబున. 29

మ. మనసంఘంబును సంస్కరించి వెలయింపన్ సత్యవిజ్ఞాన సం
జనితానందముఁగూర్ప దేశమున కుత్సాహంబుఁగల్గింపఁ బా
వనమూర్తుల్ కరుణారసాబ్ధులు దయావర్ధిష్ణులుద్యద్యశుల్
జననంబందిరి వారి జీవితకథాసారంబుఁ గ్రోలఁదగున్. 30

చ. అనుపమశేముషీకలితుఁ డభ్యుదయప్రతిభాసమన్వితుం
డనఘుఁడు నిత్యసత్యరతుఁ డబ్ధిగభీరుఁడు భవ్యమార్గవ
ర్తనుఁడుఁ గళాకలాపుఁడు విరాజితతేజుఁడు రామమోహనుం
డను కరుణాబ్ధియేర్పఱిచె నాదట బ్రహ్మసమాజ మిమ్మహిన్. 31

చ. ఇహపరసౌఖ్యమూలముగ్రహించి యచంచలదీక్షఁబూని తా
నహరహమున్ శ్రమించి జలయానమొనర్చి విదేశమేగి దు
ర్గ్రహాకృతపాపశాసనపరంపరలన్ దెగటార్చుటంగదా
సహగమనాదికృత్యము లసహ్యములైచనె నొక్కపెట్టునన్. 32

గీ. మూఢవిశ్వాసజలరాశి మునిఁగిమునిఁగి
ప్రాణములవీడు భారతప్రజలకపుడు
నావయైనిల్చి ప్రాణదానమ్ముఁజేసె
రామమోహనరాయ ధర్మప్రబోధ. 33

క. మహిళాసంతతి నణఁచెడి
సహగమనప్రముఖ దుష్టశాసనములతో
మహినిండిపోయెనని మదిఁ
తహతహపడు ప్రథమ ధర్మతత్పరుఁ డతఁడే. 34

క. ఆ యమలాత్ముని యోచన
లాయనభావమ్ము లున్నతాశయములుఁ ద
ద్ధీయుతుని సంస్కరణలిడు
నాయువు నారోగ్యమును మహాభాగ్యమ్మున్. 35

గీ. పత్రికాగ్రంథరచనా విపద్దశాళిఁ
దోలఁగఁ జేయింపఁగా నెదన్ దలఁచి న్యాయ
వాదులను నిల్పిపోరించె వాంఛలలరఁ
బుణ్యపురుషుఁ డతం డాంగ్లభూమి కేగి. 36

క. ఆతండు ఫ్రెంచినౌకా
స్వాతంత్ర్యపతాకనరసి జై జై యని ని
ర్భీతిగఁ బలుకుటవలనన్
స్వాతంత్ర్యమునకుఁ బునాదిసాగించెఁగదా. 37

వ. బ్రహ్మసమాజంబు నెలకొల్పి ప్రజావిహితధర్మంబు లుపదేశించుచు విజ్ఞానబీజములనాటుచు జీవితాంతమువఱకు దేశసేవ నేమరక ప్రజాక్షేమంబుఁగోరె. 38

గీ. రామమోహనుని యనంతరంబు సత్య
చరితుఁడైనట్టి కేశవచంద్రసేనుఁ
డమ్మహామార్గమున విహరమ్మొనర్చె
దీక్షతో సంస్కరణల బోధించుకొఱకు. 39

గీ. పాలుగుడిచెడి బాలికాబాలకులకుఁ
గంకణమ్ములు సూత్రముల్ కట్టివైచి
హైందవుల ధర్మ మిదియంచు నన్నృతమాడు
దాంభికులగెల్చి విజయధ్వజంబు నెత్తె. 40

గీ. ప్రాయముల గుర్తెఱిఁగి వధూవరులభావ
లగ్నతలను గ్రహించి కల్యాణములను
జేయుటయె ధర్మశాస్త్రముల్ చెప్పుననుచు
వివరమొనరించె విజ్ఞానవేత్తలొప్ప. 41

క. ప్రేమకు మతమని కులమని
మోమోటమిలేదు హృదయములు కలిసినచో
కోమలులు కోడెగాండ్రను
సేమంబుగఁ బెండ్లియాడఁ జెల్లునటనియెన్. 42

క. చదువులుసాములు హైందవ
సుదతులునేర్చుటకు నడ్డుజూపెడి మాయా
స్పదశాసనముల నెల్లన్
వదలించెన్ సభలనిల్చి వాదించి ధృతిన్. 43

క. మంచికిఁ జెడ్డకు మహిళల
వంచింపఁదలంచు పూర్వవచనంబుల ఖం
డించుచు సత్యంబును బో
ధించి నిరూపించినట్టి ధీనిధి యతఁడే ? 44

ఆ. పతి యధర్మములను బాటింపఁగూడదు
సతి యటంచుఁ బలుకు స్వార్థపరుల
యాటఁగట్టివైచె నానాఁడు కేశవ
చంద్రసేనుఁ డార్యసత్తముండు. 45

వ. మఱియు మహిళాస్వాతంత్ర్యమునందలి ధర్మాధర్మంబులు చర్చించి సత్కృత్యంబుల స్త్రీ పురుషులు స్వాతంత్ర్య మనుభవింపఁదగునని సత్యంబు వెలువరించె. 46

క. పొరపాటుఁ జెంది కథలో
వరుసన్ దప్పించితిని యువమణీ! నే నీ
కెఱిఁగించిన ఘనులు మహా
పురుషులు విబుధులు కళాప్రపూర్ణులు ధీరుల్. 47

భారతపురాతన వైతాళికులు

ఉ. ఆ మహితాత్ము లుద్భవమునందక పూర్వమునందె కొండవీ
డీసీమ జవించె రెడ్డికులశీతమయూఖుఁడు రాజుతమ్ముఁడై
వేమనయోగిచంద్రుఁడు కవిప్రవరుం డభిరామశిష్యుఁ డా
ధీమహితుండు కన్గొనియె దెల్లముగాఁ బరిపూర్ణతత్త్వమున్. 48

క. ఆ యోగి లోకమునఁగల
మాయల ఖండించి సత్యమార్గముఁ జూపెన్
దీయని పద్యంబులతో
హాయిగఁ గూర్చుండి విబుధు లానందింపన్. 49

చ. అరమరలేనిభావముల నందఁగఁ జేయుచుఁ దొల్లిసంఘసం
స్కరణలఁ జేసిచూపిన యఖండకళానిధి యంధకారబం
ధురమగులోకమున్ గరుణతో సవరించిన పుణ్యమూర్తి యే
చరితలనైనఁ జూడము నిజమ్ముగ నంతటిధైర్యశాలినిన్. 50

గీ. ఆటవెలఁదుల సాంగత్యమాచరించి
ప్రజలచే దూషణలఁ బొందెఁ బ్రథమదశను
నాటవెలఁదుల సాంగత్యమాచరించి
ప్రజలచే భూషణమ్ములు పడసెఁ బిదప. 51

గీ. మతములన్ గల్గు మాయలు మర్మములును
కులములన్ గల్గు తెరచాటుకూటములును
నొక్కమొగిఁ దేలిపోయె నయ్యోగివరుని
దయ విరియఁ బాఱు పద్యరత్నములవలన. 52

వ. వెండియు నొకమహామహునిగూర్చి వివరింతు. వేమన వెనుకఁగొంత
కాలంబు గడచినపిమ్మట. 53

గీ. భారతపవిత్రకనకగర్భంబునందుఁ
ప్రభవమందె మహాత్ముండు బ్రహ్మగురుఁడు
కందిమల్లయ్యపల్లియయందు నిలిచి
దయనొసఁగె నాత్మబోధసుధారసంబు. 54

క. ఆ లలితబుద్ధి వ్రాసిన
కాలజ్ఞానంబునందుఁ గన్పట్టెకు ని
క్కాలమున జరుగుచుండెడి
మేలుంగీడులును బ్రజ భ్రమించుచుఁజూడన్. 55

సీ. అస్పృశ్యతాభంజకాశయమ్ములఁజాటె
మాలకక్కన్నపై జాలిచూపి
మతసామరస్యసంపద నిరూపణచేసె
సిద్దన్నతోఁ జెల్మిసేయనేర్చి
కులదురోన్మాదమున్ దొలఁగించుటను జూపె.
వల రెడ్డియచ్చమ్మ చలిదినంజి
కీర్తి హేతువు స్వయంకృషియన్న నుడిఁదేల్చెఁ
గడఁగి నిల్పిన యయఃకర్మశాల

గీ. స్త్రీజనోద్ధరణాసక్తిఁ దెలిపె నాతఁ
డర్థినెలకొల్పు మహిళాకళాలయమున
నమ్మహాత్ముని సందేశమాలకించి
కన్నులనువిప్పిచూచె లోకమ్ము నాఁడు. 56

రామకృష్ణపరమహంస

ఆ. అవతరించెఁ బిదప నాబాలగోపాల
మును దరింపఁజేయఁ బుణ్యమూర్తి
పరమపావనుండు కరుణాబ్ధి విజ్ఞాన
పరుఁడు రామకృష్ణపరమహంస. 57

గీ. వంగదేశమనీషియష్టాంగయోగ
సాధనుఁడు కాళికాసత్ప్రసాదపాత్ర
భవ్యచిత్తుఁడు పరిపూర్ణభావవిదుఁడు
రామకృష్ణుఁ డతండు భారతతపస్వి. 58

ఉ. కమ్మనిబోధతోఁ గలియుగంబున మాయననంచి విశ్వవి
శ్వమ్మనకొక్కవెల్గిడి యజస్రముఁదాత్త్వికవాక్సుధారస
మ్మిమ్మహిఁబాఱఁజేసి వెలయించి విముక్తిపథమ్ము సర్వధ
ర్మమ్ముల బోధచేసె నుపమానపరంపర శిష్యకోటికిన్. 59

క. ఆ మహితాత్ముఁడు భక్తి
ప్రేమసుధారసముఁబోసి పెంచెను జగమున్
స్వామివివేకానందుం
డా మాన్యతపస్విశిష్యుఁడై పయినించెన్. 60

స్వామి వివేకానందుఁడు

చ. కదలి యఖండదీక్ష నవఖండములన్ విహరించి భారతా
భ్యుదయము పెంపుసేయ మధురోక్తులతోఁ గమనీయభావసం
పద నలరారులేఖలఁ గృపామతి వ్రాసెను విద్యలన్నియున్
జదివినబ్రహ్మచారి మనజాతి కితండు హితుండు నెచ్చెలీ. 61

చ. అతులితశేముషీప్రతిభలంది సమస్తమతప్రభాసభా
ప్రతినిధియై సుధామధురబంధురవాగ్రసధారలూర న
ద్భుతమగుబోధఁ జేసె విబుధుల్ తలలూఁపి సెబాసనంగ భా
రత నిగమాగమార్థచతురప్రతివాక్యపరంపరోద్ధతిన్. 62

ఉ. హైందవసంప్రదాయము మహామహమంచు సమస్తఖండముల్
డెందములం గదల్పఁ బ్రకటించె గళధ్వనిమిన్నుముట్ట స్వ
చ్ఛందయశోలతల్ దశదిశావలయమ్మునకెక్కి ప్రాఁక మ
ధ్యందినభానుమండలవిధంబున సన్ముఖబింబ మొప్పఁగన్. 63

గీ. తత్కృపానిధిబోధసుధారసప్ర
వాహములుపాఱుకతన విద్వజ్జనాళి
నంచితజ్ఞానబీజమ్ము లంకురించి
హైందవమతంబువెలసె ఖండాంతరముల. 64

ఉ. ఆ మహనీయునట్లు సుకృతాత్ములు కొందఱుపుట్టి భారత
క్షేమకరప్రబోధములఁ జేసి రహర్నిశమున్ సహోదర
ప్రేమసుధారసమ్ముఁ బఱపించిరి వారిమహాచరిత్రలన్
నామములన్స్మరించి తదనంతరగాథలనెల్లఁ జెప్పెదన్. 65

విజ్ఞానబీజస్థాపన ప్రయత్నములు

వ. ఇఁక దేశదాస్యాంధకారంబుంబాపదగు విజ్ఞానంబు ప్రజలకవసరం బగుట గ్రహించి వంగరాష్ట్రంబున, బ్రిటీషిండియన్ సంఘమును స్థాపించి రాజేంద్రలాల్ మైత్రా రామగోపాలఘోషు ప్రముఖులును బొంబాయిసంఘము నెలకొల్పి దాదాభాయి, నౌరోజి, జగన్నాథశంకరసేతు, మంగళదాసు నాథూబాయి నౌరోజి పరంజీ ప్రభృతులును, దక్షిణమున 'హిందూ'పత్రికను బ్రకటించి విజయ రాఘవాచార్యులు రంగయ్యనాయుడు జి. సుబ్రహ్మణ్యమయ్యరు న్యాయపతి సుబ్బారాయాది వీరులును మరల వంగరాష్ట్రంబుననే

ఇండియనసోషియేషన్ నిలిపి సారథులై సురేంద్రనాథబెనర్జీ యానందబోసులును మహారాష్ట్రమున 'పూనాసార్వజనికసభ' వెలయఁజేసి రావుబహదూర్ కే. యల్. నూల్. కౌన్. యస్. చిప్లోకరాది మహామహులును దేశసేవనొనర్పందొడంగిరి. పిదపఁ కాంగ్రెసుపుట్టుకయు నమ్మహాసంస్థాభివృద్ధియు నెటింగింతు వినుము.

క. కదలినవి భారతీయుల
హృదయముల నవమానముల సహింపక యదియే
మొదలై ప్రగతికిఁ గడుదో
హదమై యభివృద్ధిఁజేసె నభ్యుదయంబుల్. 67

క. ఆలోచింపఁ దొడంగిరి
పాలనమునఁగలుగు లోటుపాటులనెల్లన్
మేలెట్లుకలుగునని ప్రజ
లోలోఁదలపోసె నెట్టులోయని పథమున్. 68

క. గునగునలు పెరిఁగె భారత
జనమున మనధరణి నన్యజాతీయులు పా
లన చేయుచు మనసంపదఁ
గొనిపోవుచునుండిరనుచు గూఢస్థితులన్. 69

వ. అదియుంగాక. 70

క. మేలెంచఁబోక 'లిట్టన్'
పాలించెడి కాలమదియు ప్రజలందఱు గ
గ్గోలుపడుచుండ గుండెకు
గాలములైతగిలె నపుడె కఱవులు వత్సా. 71

ఉ. అంతకుముందవచ్చినది 'ఆఫ్గను'యుద్ధము దానికై ధనం
బెంతయొ క్రుంగిపోవుట మహీప్రజకుం గడుభీతిపుట్టె న
త్యంతవిషాదఘట్టమది యా వగదాఁటు టికెట్టులంచెదన్
జంతిలసాగె లోకము వచింప నశక్యము లా విపద్దశల్. 72

ప్రజల హృదయంబుల విప్లవజ్వాల లుద్భవించుట.

క. ఎన్నిక ఱవు లరుదెంచినఁ
బన్నులఁ దగ్గింపరైరి పరభూపతు లా
పన్నులు ప్రజలని సుంతయు
మన్ననఁ జూపింపరైరి మాత్సర్యమునన్. 73

క. నిఱుపేదవారు తిండికి
జరుగక యాఁకటికిఁ దాళఁజాలక యన్నా
తురులై మలమల మాడిరి
మరణించిరి తుదకుఁ గొంతమంది వయస్యా. 74

క. వలలన్ జిక్కిన పులుఁగుల
వలె హిందూప్రజలు కాలవశులై ధవళాం
గులు పన్నినబంధనముల
నిలిచిరి కీల్బొమ్మలై యనేకశ్రమలన్. 75

ఉ. పాలకులట్టులుంటఁ బయిపైఁగ ఱవుల్ చెలరేఁగుచుంట నా
కాలము జాఱిగుండియకు గాలముగా దరిలేని కష్టన
ష్టాలకు దారిదీయుటఁ బ్రజాహృదయంబుల రేఁగె విప్లవ
జ్వాలలు భగ్గుభగ్గున దిశావలయమ్ములను జుట్టుచున్. 76

ఉ. వేగముగా బయల్వెడలు విప్లవమున్ గ్రహియించె నున్నతో
ద్యోగమునంది భారతమపైఁ బార్వసించిన యాంగ్లనాయకుం
డాగమనంబు నాఁప హృదయంబున నెంచి విచారమొంతయో
రేఁగఁగఁ జేరఁబోయె 'డఫరిన్' కడ కాతఁడు గార్నరాటచే. 77

క. ఇరువురు నాలోచించిన
సరణియెదో కాని వచ్చి సర్ హ్యూమ్ దయా
కరహృదయుండై యొక యు
త్తరమున్ లిఖియించెఁ గలకతా కంపుటకై. 78

వ. అయ్యుత్తరంబున నిట్లుండె. 79

కలకత్తాకు వ్రాసిన లేఖ

క. దేశక్షేమమునకు దీ
ర్ఘాశపథములూని రండు జాతీయసమా
వేశము జరిపించెద మీ
యాశలు ఫలించు నిఁక మహాశయులారా. 80

గీ. స్వార్థరహితులు నైతికశక్తిపరులు
నాత్మనిగ్రహరతులు సత్యానుకూల
మహితచరితులు నేఁబదిమంది యందుఁ
జేరినఁజాలు మీ దరిఁజేరు మేలు. 81

గీ. మాతృదేశంబుపై నభిమానమింత
లేనివారలు పుడమిలో లేనివారు
మానవత్వముగల్గిన మనుజులెల్ల
స్వీయసౌఖ్యమ్ము విడి సేవసేయఁదగును. 82

ఆ. ఎవరు స్వీయసౌఖ్యమెల్లకాలంబును
గోరికొందు రట్టివారు మంచి
పాలనమున కాశపడ నసర్హులు సేవ
కొఱకురానివారు కుటిలమతులు. 83

క. అని యెన్నోధర్మంబులు
తనువులుపొంగఁగ లిఖించి తత్క్షణమే పం
పెను బట్టభద్రులకు ధీ
ఖనులకుఁ దద్ధర్మమూర్తి గౌరవమొప్పన్. 84

వ. అట్లుపంపించెఁగాని 85

ఉ. ఆ సభ రాజకీయముల నంటఁగ రా దటనుండు గౌర్న ర
గ్రాసనమందఁగాఁదగుఁ దదన్యు లనర్హులు సంఘమూఢవి
శ్వాసములన్ వదల్పఁగలచర్చలుమాత్రము సల్పవచ్చు నన్
శాసనముల్ సృజించికొనసాఁగె మనంబున హ్యూము ధీనిధీ. 86

గౌర్నర్ డఫరిన్ హ్యూం సంభాషణ

క. అపుడే వచ్చిన గౌర్నర్
డపరిన్ కడకేఁగె హ్యూం హుటాహుటిగ మహా
నిపుణమతి వినిచె నాకథ
యుపకారముఁగూర్చి యెంతయో వివరించెన్. 87

చ. వినుమిటఁ గానిపించినవి విప్లవసూచన లందుచేత నీ
పని నెఱవేర్చుచుంటిని గృపామయ! యీసభ రాజకీయయో
జనలకుఁ దావొసంగ దొకసాంఘికచర్చకుఁదప్పఁ దత్సభా
సనము నలంకరించుటకు సమ్మతినిండని వేఁడె వేఁడినన్. 88

ఆ. వినుచు నవ్వి డఫరి ననె హ్యూముతో మహా
భాగ యట్లుసేయ భావ్యమగునె?
రాజకీయచర్చ రాకున్నఁ దెలియునే
పాలనమున లోటుపాట్లు మనకు. 89

గీ. ఆ సభాధ్యక్షులము మనమైనయెడల
నాత్మలంగల్గుదానిమాటాడఁగలరె
పాలితులు పాలకుల లోటుపాట్లుఁగూర్చి
యెదుట వచియింపఁగలరె? యిదేటిమాట. 90

గీ. అచటఁగూడిన ప్రతినిధులందు నొకని
నాసభాధ్యక్షునిగ నిల్పనగును సభను
మానవలదన్న! నాపేరుమాత్ర మిందుఁ
బ్రకటనముచేయవలదని పంపె నంత. 91

వ. పిదప నమ్మహనీయుఁడు తద్వృత్తాంతంబు భారతీయులకెఱుకపఱచి
పెద్దల నాలోచించి. 92

భారత మహాజనసభాప్రయత్నము

క. పూనానగరంబు సభా
స్థానంబని నిర్ణయించి సత్వరముగ నా
హ్వానము నంపె భారత
ధీనిధులకుఁ దదితరులగు దివ్యాత్ములకున్. 93

వ. కాని యాసమయమ్మున. 94

మ. నలుమూలల్ చెలరేఁగి క్రమ్మికొనెఁ బూనాపట్టణంబంతటన్.
గలరా జాడ్యముకాన నచ్చటిసభా కార్యంబులన్నిల్పి యు
జ్జ్వలతేజోమయమై కళాకలితమై వర్ధిల్లు బొంబాయిలో
వెలయన్ జేయఁగ నిశ్చయించిరి సమావేశమ్ము మోదమ్ముగన్.

గీ. దివ్యమతులైన గోకులు తేజపాలు
రా సభాప్రతినిధుల కాహ్లాదమొసఁగఁ
దమ కళాశాలలనొసంగి ధర్మబుద్ధిఁ
బ్రకటనమొనర్చి రుత్సాహభరితులగుచు. 96

క. ఆరాత్రి చేరఁగల్గిరి
గౌరవధనులున్ యశఃప్రకాశులు విద్యా
పారీణులు ధీరాత్ములు
భారతనాయకులుఁ దత్సభాప్రతినిధులై. 97

వ. ఆహ్వానసంఘము తమతమకేర్పఱచిన వసతుల స్వీకరించి మెల్లి
జరుపనెంచు సభాస్వరూపములఁజర్చించి హాయిగ విశ్రమించిరి.
సభాభవనంబలంకరింపఁబడియె. 98

ఉ. ఈ యమితాంధకారమున నెన్నఁడెఱుంగని నిద్రవోవ నా
దాయముకొల్లగొట్టిరికదా యెవరోయను భారతీయులా
రా! యిఁకనైన మేలుకొనరా యనిపిల్చినయట్లు కొక్కొరో
కోయని కూయసాగినవి కుక్కుటముల్ మధురారవంబులన్. 99

వ. మఱియు. 100

సీ. కడిసి లోకమునిందు కాఱుఁజీఁకటిపటా
పంచలై దిగజాఱుపట్టునందు
సముచితోత్సాహమెచ్చఁగఁ జక్రవాకముల్
కదలిగంతిడఁబోవు కాలమందు
దమ సువర్ణసహస్రదళములన్ వికసింప
జలజముల్ యత్నించు సమయమందు
సర్వజీవులకు హెచ్చరిక లిచ్చుటకునై
వేఁగుఁజుక్కజనించు వేళయందుఁ

గీ. దఱచి యమృతంబుఁదీయఁగా దధిఘటాల
దరిసి కవ్వమ్ములాడెడి తరుణమందుఁ
గూర్మినందనులను మేలుకొల్పసాగె
భవ్యగుణగణసముపేత భరమాత. 101

వ. చరిత్రయందుఁ బ్రసిద్ధినందు నాసభకుఁ బ్రతినిధులుగ 'త్రైమాసి' ధ్యానప్రకాశ 'మహారాష్ట్రకేసరి' నబాజీబాకార్, ఇండియన్ మిారన్, నాసీమ్, 'హిందూట్రిబ్యూన్' ఇండియన్ యూనియన్ ఇండియన్ స్పెక్టేటర్, హిందూప్రకాశ్, హిందూక్రెసెంటు, పత్రికాధిపతులును సిమ్లానుండి ఏ. ఓ. హ్యూం, కలకత్తానుండి నరేంద్రనాధసేన్, డబ్ల్యు. సి. బెనర్జి, పూనానుండి డి. సి. ఆప్టే, జి. జి. ఆగార్కార్, లక్నోనుండి దాదాభాయి నారోజి, గంగాప్రసాదవర్మ, కె. టి. తెలంగాన్, ఫిరోజిషామెహతా డి. ఇ. వాచా, బి. యన్. మలబారీ, బొంబాయినుండి యస్. సుబ్రహ్మణ్యయ్యరు, పి. ఆనందాచార్యులు, జి. సుబ్రహ్మణ్యయ్యరు యం. వీరరాఘవాచార్యులు మొదలగువారరుదెంచిరి. మఱియు నాఁటిసమయము ననుసరించి ప్రతినిధులుగఁ జేరనేరని మహామహులనేకులువచ్చిరి. అందు దివాన్ బహద్దరు, రఘునాధరావుగారును, మానసీయమహాదేవ్ గారును శాసనసభాధిపతియగు జస్టిస్ రెనడే

గారును బహుగ్రంథకర్తయగు పండిత లాలాభాజినాధ్ గారును,
కె. సుందరరామ్, ఆర్. జి. భండార్కార్ గారలును గలరు. ప్రేక్షక
జనముతోడను వివిధాలంకరణములతోడను భారతమహాసభాభవ
నము కన్నులపండువై భాసిల్లుచుండె. 102

ప్రథమ భారతమహాజనసభ

గీ. బాలసూర్యోదయంబు సభామహోద
యంబు నొకసుముహూర్తంబునందె కలిగె
నంధకారము చటులదాస్యాంధకార
మణఁగిపోయెడి శుభకాల మరుగుదెంచె. 103

క. ప్రతినిధులుఁ వివిధకళా
ప్రతిభానిధులెందఱో సభావేదికపై
నతిముదముననుండిరి భా
రతజన సభ యవతరించె రమ్యాకృతులన్. 104

వ. అయ్యది పదునెనిమిదివందలయెనుబదియైదవ సంవత్సరమున డిసెం
బరునం దిరువదియెనిమిదవదినము. అమ్మహాసభాధ్యక్షపీఠము నలంక
రింప డబ్ల్యు. సి. బెనర్జీపేరును హ్యూము సూచించె నద్దాని
సుబ్రహ్మణ్యయ్య రనువదించుటయుఁ దెలంగాన్ మహాశయుఁ
డామోదించుటయు జరిగె. 105

మ. పరమాహ్లాదముతో సభాప్రతినిధుల్ ప్రార్థింప నుత్సాహియై
కరతాళధ్వను లుల్లసిల్లఁగ సభాంగంబెల్ల నుప్పొంగ సు
స్థిరసంకల్పవిహారి ధీరుఁడు బెనర్జీ మందహాసమ్ముతోఁ
బరివేష్టించెఁ దదగ్రపీఠమున శుంభత్ప్రౌఢి దీపింపఁగన్. 106

వ. పిదప నమ్మహానుభావుండు సభాగౌరవప్రాతినిధ్యములఁ గూర్చి ముచ్చ
టించుచు సభాసంకల్పములు నాలుగనియు నందొకటి సామ్రాజ్య
వివిధ భాగములవసించి మనదేశసౌభాగ్యమునకు శ్రద్ధవహించి
పాటుపడువారందఱకుఁ బరిచయముగల్గించి మిత్రత్వంబుఁ జేకూర్చు

టయు. రెండవది దేశాభిమానులయందుఁ బ్రత్యక్షస్నేహసంభాష ణలఁగల్గించి జాతిమతరాష్ట్ర దురభిమానముల వదలించి చిరస్మర ణీయమగు రిప్పన్ ప్రభుపాలనమునఁ బ్రారంభమైన జాతీయైక్యతాభి ప్రాయములఁ గేంద్రీకరించి వృద్ధిఁజేయుటయు. మూఁడవది ప్రధాన సాంఘిక సమస్యలపై విద్యావంతులుఁ బ్రముఖులగు భారతీయులు పూర్ణముగఁ జర్చించి యవ్వారియభిప్రాయమ్ముల నధికారయుత ముగఁ బ్రకటింపఁజేయుటయు నాల్గవది దేశీయరాజకార్య ధురంధ రులు నేఁటినుండి రాఁబోవు సంవత్సరమువఱకుఁ బ్రజాశ్రేయము నకునై చేయఁదగిన కార్యక్రమము నిర్ణయించుటయు నైయున్నవి. ఇఁక నాఁటి ప్రథమ భారతమహాజనసభ జరిగిన తీర్మానముల గూర్చి వక్కాణింతు. అందొకటి భారతపరిపాలన విధానమున మంచిచెడ్డలఁ బరిశీలించి యోజించుటయు రెండవయది యిండియా కౌన్సిలు తీసివేయింపవలెననియు మూఁడవది శాసనసభలలో నెన్నికయైన సభ్యులుండఁదగుననియుఁ బ్రశ్నలువేయుటకధికారము కలుగవలెననియు నయోధ్య, పంజాబు, పశ్చిమోత్తరరాష్ట్రముల నెలకొల్పవలెననియు శాసనసభలలో నధికసంఖ్యాకుల వ్యతిరేకాభి ప్రాయముల విచారించుటకుఁ గామన్సుసభలో నొకసంఘముంచుట మంచిదనియు.నాల్గవది ఐ. సి. యస్. పరీక్షల నేకకాలమ్మున జరుపు నట్లును తద్విద్యార్థుల వయఃపరిమితి హెచ్చింపవలెననియు.నైదారు తీర్మానములు సైనికవ్యయముల యోజింపఁదగుననియు. నేడవది బర్మారాష్ట్రమును విచారింపవలయుననియు. నెనిమిదవది పైతీర్మా నములన్నిటి రాజకీయసంఘములకుఁ బంపవలెననియుఁ గోరికొను చున్నవిగా జరుపబడియున్నవి. యాసభఁ జరుగుతీర్మానముల నందఱేకగ్రీవముగ నామోదించి రెండవ సభాకాలంబిదియని నిర్ణ యించిరి.

ఉ. ఆసభ హాయిగాజరుగుటాది మహాపురుషుల్ కృపాత్ము లు
ల్లాసపయోధిఁ దేల మరలన్ జరిపించుఁడటంచు లేఖలన్
వ్రాసిరి చూడఁగాఁగదలివచ్చెదమంచుఁ బ్రజల్ ప్రయత్నముల్
చేసికొనంగనెంచిరి విశేషమనీషలఁబెంచి ప్రేముడిన్. 108

క. యువచూడామణి యిపుడే
వివరించినగాథనెల్ల వింటివి యింకన్
వివరింతు నహింసా వి
ప్లవజాతీయోద్యమ ప్రభావచరిత్రన్. 109






భారతీ ప్రెస్, తెనాలి.

ప్రతులకు :

కన్నెకంటి వీరభద్రాచార్యులు,

మోర్జంపాడు పోస్టు

పల్నాడు తాలూకా * గుంటూరు జిల్లా